Approved by the Text Book Committee
Vide Fort St. George Gazette Part I B. Page 7 Dated 6-7-25.

# కపాలకుండల

శ్రీ బంకిమచంద్ర చట్టోపాధ్యాయుని
వంగమాతృక కాంధ్రము

శ్రీ త్రిపురారిభట్ల
వీరరాఘవస్వామి
వైస్ ప్రిన్సిపాల్: సంస్కృత
కళాశాల: తెనాలి.

సాహితీ సమితి
తెనాలి. (గుంటూరు)

సమర్పణము

శ్రీ శివశంకరశాస్త్రికి

# కపాలకుండల

## ప్రథమ ఖండము

### ౧

అది మాఘమాసము. ఒకనాఁటి వేఁకువజామున యాత్రికుల నావ యొకటి గంగాసాగరసంగమప్రదేశమునుండి మరలి వచ్చుచుండెను. ఆకాలమున పోర్చుగీసులు నితరదేశీయులును బడవలను గొల్లగొట్టుచుండుటచే వారి భయమున యాత్రికులు తమ తమ నావలను గుంపుగాఁ జేర్చికొని రాకపోకలు చేయుచుండిరి. కాని యీనావయం దున్నవారి కితరుల సాయమేమియు లేదు. కారణ మేమనఁ దెల్లవాఱుజామున దిగంతములందుఁ గారుమబ్బులు భయంకరముగాఁ గ్రమ్ముకొనుటచే నావికులు దిక్కులు నిరూపింప లేక నౌకాశ్రేణినుండి విడివడి చాలదూరము కొట్టుకొనిపోయిరి. ఆసమయమున నెవ్వ రే దిక్కునఁ బోవుచుండిరో వారి కెంతమాత్రము తెలియుట లేదు. నావయం దున్న వారిలోఁ జాలమంది నిదురించుచుండిరి. వృద్ధుఁ డొకఁడును యువకుఁ డొకఁడును మాత్రము మేలుకొని యుండిరి. ముదుసలి పడుచువానితో సంభాషించుచుఁ గొంచె మాఁగి ప్రధాననావికునితో "ఓయీ! నేఁడు మన మెంతదూరము పోఁగలము?" అనెను. వాఁ డటునిటుఁ దిరుగుచు "ఏమో నిశ్చయముగాఁ జెప్ప లేను!" అని బదులు పలికెను.

వృద్ధుఁడు క్రుద్ధుఁడై నావికుని నిందింపసాగెను. అప్పు డా తరుణుఁడు "ఆర్యా! పరమేశ్వరుని లీలలను బండితులు సయితము గ్రహింపలేరు గదా! ఆమూర్ఖుఁడెట్లు తెలిసికొనఁ గలఁడు? తమరు కలఁత చెందవలదు!" అని వచించెను.

ముసలివాఁ డుచ్చైస్స్వరముతో "కలఁత చెంద వలదా యేమి! దుర్మార్గు లేడెనిమిది యెకరములభూమిలోని ధాన్య మంతయు నూర్చుకొని పోఁగా సంవత్సరము పొడవునను బిల్ల పాపలకు భుక్తి యెట్లు జరుగునో చెప్పు, చూతము!" అని పలికెను.

ఇతఁడు నావ యెక్కిన తరువాతఁ దన వెనుక వచ్చిన యాత్రికుని నోట నీవృత్తాంతము వినెను. అంతట యువకుఁ డిట్లనెను: "మహాశయా! తమయింట సంసారము నడపు వారు వే ఱెవ్వరు లే రని మొదటనే సెలవిచ్చినారు. మహా శయు లిప్పు డిల్లు వెడలివచ్చు టంత బాగుగా లేదు."

ముదుసలి పూర్వమువలె బిగ్గరగా నిట్లనెను: 'ఏమీ! నేను వచ్చుట బాగుగా లేదా! మూఁడువంతుల కాలము గడచిపోయినది. ఇఁక నొక్కవంతుమాత్ర మున్నది. ఇప్పు డైనను బరముసంగతి విచారించుకొనకపోయిన నిఁక నెప్పుడు?"

"తమకు శాస్త్రము తెలిసియున్నయెడలఁ దీర్థయాత్రవలన గలుగు పుణ్య మింటిదగ్గఱ నుండి కూడ సంపాదించుకొనఁ గలరు."

"అట్లయిన నీ వేల వచ్చితివి?"

'నా సంగతి తమకు మొదటనే మనవిచేసికొన్నాను. సముద్రమును జూడవలెననెడి యుత్సాహము తప్ప నారాకకు వేఱు కారణము లేదు.'

తరువాతఁ గొంతసేపటికి యువకుఁడు వెనుకటికన్న మృదుస్వరముతో నిట్లనుకొనెను. "ఆహా! ఏమి యీప్రకృతిసౌందర్యము! జన్మజన్మాంతరములందుఁగూడ నిది మఱపురాదు.

"దూరా దయశ్చక్రనిభస్య తన్వీ
తమాలతాలీ వనరాజి నీలా
ఆభాతి వేలా లవణాంబురాశేః
ధారానిబద్ధేవ కలంకరేఖా!"

వృద్ధుని మనస్సు పద్యముమీఁద లేదు. నావికు లేదియో యొండొరులతో మాటలాడుచుండ నతఁ డేకాగ్రచిత్తముతో వినుచుండెను.

ఒక నావికుఁ డింకొకనితో నిట్లు చెప్పుచుండెను. ఇంత ప్రయత్నముకూడ చెడిపోవున ట్లున్నది. ఎప్పటికిఁ దీరముఁ జేరఁగలమో యేదేశము పోయెదమో యెంత మాత్రముఁ దెలియకున్నది."

నావికుని కంఠస్వర మత్యంత భయసూచకముగానుండెను. ఏదియో గొప్ప విపత్తు నా శంకించుటకుఁ గారణము కలిగినదని వృద్ధుఁ డనుకొనెను. అంత నతఁడు శంకిత చిత్తముతో "ఓయీ! ఏమి సంభవించినది?" అని నావికుని బ్రశ్నించెను. వాఁడు ప్రత్యుత్తర మీయలేదు. యువకుఁ డతని ప్రత్యుత్తరమున కై నిరీక్షింపక బయటికి వచ్చి ప్రభాతముకావచ్చుచుండె

వని తెలిసికొనెను. కాలమేఘమాలలు నలుదెసలఁ గ్రమ్ము కొనియుండెను. ఆకాశము నక్షత్రములు చంద్రుఁడు తీరము మొదలగున వేవియుఁ గానవచ్చుట లేదు. నావికులు దిగ్భ్రమము చెందినట్లు తేటతెల్ల మయ్యెను. తా మేదిక్కునకుఁ బోవుచున్నదియు వారు నిజముగాఁ దెలిసికొనలేకుండిరి. అంతే కాక మహాసముద్రమునఁ బడి యొడ్డు చేరలేక మరణింతు మనుభయముచే వారు చీకాకు పడుచుండిరి.

మంచు పడకుండ నావ పైభాగమున నాచ్ఛాదనముండెను. అందుచే నావలో నున్నవారీవిషయ మంతయును దెలిసికొన వీలు లేదు. యాత్రికుల ప్రస్తుతావస్థను దెలిసికొని పడుచు వాఁడు ముసలివానికి సర్వము నెఱిఁగించెను. అంతట నావలో బెద్దకోలాహల ముద్భవించెను. అంతకుఁ బూర్వము నౌకలో నిద్రించుచున్న స్త్రీలీకలకలమునకు మేలుకొని సందర్భము తెలిసినంతనే యార్తనాదములు చేయ నారంభించిరి. "నావ నొడ్డునకుఁ బట్టుఁడు, ఒడ్డునకుఁ బట్టుఁడు!" అని వృద్ధుఁడు కేకలిడెను.

పడుచువాఁడు మందహాసముచేసి, "మహాశయా! ఒడ్డెచట నున్నది! అదియే తెలిసిన నేఁ డింత విపత్తు మన కేల తటస్థించును?" అని మెల్లగా ననెను.

యువకుని మాటలు విని నావలోనివారు మఱింత కోలాహలము చేయసాగిరి. అతఁడు వారి నందఱ నెట్లో యూఱడించి నావికులతో నిట్లనెను: "నావికులారా! మీ రెంతమాత్రము భయపడ నవసరము లేదు. తెల్లవాఱ వచ్చుచున్నది. నాలు

వైదు గడియలలో సూర్యోదయ మగును. ఈలోపల నావకే మోసము రాఁగూడదు. మీ రింతలోఁ దెరచాపలను దింపి ప్రవాహము వెంట నావను బోనిండు. వెలుతురు వచ్చినతరు వాత మిగిలిన సంగతు లాలోచింతము."

నావికు లీ యాలోచనమునకు సమ్మతించిరి.

చాలసేపటివఱకును వారు నిశ్చేష్టులయి యుండిరి. యాత్రికులు భయముచేఁ గంఠగతప్రాణు లైరి. గాలి విశేషముగా వీచుట లేదు. అందుచేఁ దరంగాందోలనము వారి కంతగాఁ దెలియుట లేదు; అయినను మృత్యువు సమీపించుచున్నదని వారు నిశ్చయము చేసికొనిరి. పురుషులు నిశ్శబ్దముగా దుర్గానామము జపింపసాగిరి. స్త్రీలు కంఠ మెత్తి వివిధశబ్దవిన్యాసముతో విలపింప సాగిరి. గంగాసాగరసంగమమునఁ దనబిడ్డను బాఱవైచి వచ్చిన స్త్రీయొక తెమాత్ర మేడ్చుట లేదు.

ఇట్లు ప్రభాతమునకై నిరీక్షించుచుండ జాము గడచి పోయెను. అంత నాకస్మికముగా నావికులు "పాంచపీరుల" నామములు స్మరించుచుఁ గోలాహలము చేయనారంభించిరి. యాత్రికు లందఱు "ఏమి జరిగినది, ఏమి సంభవించినది?" అని యొక పెట్టున వారల నడిగిరి. నావికు లైకకంఠ్యముగఁ గలకలము చేయుచు "సూర్యోదయము, సూర్యోదయము! అదిగో తీరము, అదిగో తీరము!" అని కేకలు వేసిరి. యాత్రికు లందఱు మహోత్సాహముతో దా మేతీరమునకు వచ్చినారో, సంగతి యేమో తెలిసికొనుటకై నావపైకి వచ్చిరి.

సూర్యోదయ మయ్యెను. నల్లమబ్బు లెక్కడివక్కడ చెల్లాచెద
రైపోయెను. నావవచ్చి చేరిన ప్రదేశము సముద్రము కాదు,
నదీముఖమే. నది కచట నున్నంత వెడల్పు మఱియెచ్చటను
లేదు. నావ నదీతీరమునకుఁ జాలసమీపముననున్నది. కాని
యావలియొడ్డు గుఱుతైనను గానఁబడుట లేదు. ఎటుఁ జూచి
నను నపారజలరాశి చంచలమై సూర్యకాంతిలోఁ బ్రకాశించు
చు దిగంతములందు గగనముతోఁ గలిసిపోవుచున్నట్లుండెను.
నావ నిలిచినచోట తీరము బురదతోఁ గూడి నదీజలమువలెఁ
గానవచ్చుచుండెను; దూరమున జలము నీలవర్ణముతోఁ
బ్రకాశించుచుండెను. మహాసముద్రమునఁ బడితి మని వారను
కొనిరి; కాని యదృష్టవశమునఁ దీరము సమీపమున నుండు
టచే భయపడ నవసరము లేదని యాత్రికులు నిశ్చయము
చేసికొనిరి. సూర్యబింబమును జూచి దిక్కులు నిరూపించి
యెదుటఁ గనఁ బడునది సముద్రపుఁబశ్చిమతీర మని వారు
తేల్చుకొనిరి. నావకు సమీపముగాఁ దీరమం దొకచోట
నింకొకనది మందగమనయై కలధౌతప్రవాహమువలె వచ్చి
యిందుఁ గలియుచుండెను. సంగమస్థలమునకు దక్షిణముగా
నున్న సైకతభూమిపై నసంఖ్యాకము లగు నానావిధ విహంగ
ములు క్రీడించుచుండెను. ఈనదికిప్పుడు రసుల్‌పురనది
యనిపేరు.

## ౨

యాత్రికుల సంతోషధ్వనులు సమసినంతనే నావికులిట్లనిరి: "సముద్రముపోటు వచ్చుట కింకను నాలస్యము కలదు. ఈలోపల నెదుట నున్న యిసుకతిన్నెపై వంటచేసికొని భోజనము చేయుఁడు. పోటు ప్రారంభము కాఁగానే స్వగ్రామము నకుఁబోవుట సులభముగా నుండును." వారు వచించిన దానికి యాత్రికులు సమ్మతించిరి. పిమ్మట నావ యొడ్డునకుఁ జేరినంతనే యాత్రికులు క్రిందికి దిగివచ్చి స్నానాది ప్రాతఃకృత్యములు నిర్వర్తింప సాగిరి.

స్నానాదులు ముగిసిన తరువాత వంటచేసికొనుట కింకొక యాతంకము కలిగెను. నావలో వంట చెఱకైపోయినది. అరణ్య మృగములభయముచేఁ బైకిఁ బోయి కట్టెలు గొనివచ్చుట కెవ్వరును సమ్మతింప లేదు. అంత నందఱు నుపవాసము చేయుట కుపక్రమించుటచే వృద్ధుఁడు తరుణుని బిలిచి, "నవకుమారబాబూ, నీ విప్పు డేదైన నుపాయ మాలోచింపనిచో మన మందఱము భోజనము లేక చావవలసి వచ్చును" అనెను.

నవకుమారుఁడు కొంచె మాలోచించి "మంచిది, నేను వెళ్ళెదను. గొడ్డలి యిండు. కట్టెలు మోసికొనివచ్చుటకు నాకుఁ దోడెవ్వరైన రావలయును" అని పలికెను.

నవకుమారునకుఁ దోడుగాఁ బోవుట కెవ్వరు నంగీకరింప లేదు, "భోజనమునకు మాత్ర మందఱు సిద్ధమయ్యెదరు!" అని

విసిగికొనుచు నతఁడు నడుము బిగించి కుఠారము భుజముపైఁ బెట్టుకొని కట్టెలు గొనివచ్చుటకు బయలుదేఱెను.

నవకుమారుఁడు తీరమువీఁదికిఁ బోయిచూడఁగనుచూపు మేరలో నెచ్చటను మానవనివాసచిహ్నములు కానరాలేదు. అంతయు నడవి. ఆ యరణ్యముకూడ నిబిడము, దీర్ఘవృక్షావలీ శోభితము కాదు. అచ్చటచ్చటఁ జిన్నిచిన్ని పొదలును నడుమ నడుమ మండలాకారము గల సైకతస్తూపములును గలవు. నవకుమారున కాపొదలలోఁ బ్రకృతోపయోగము లగుకాష్ఠము లేవియు లభింపలేదు: అందుచేఁ బెద్దచెట్లు గనఁబడువఱకు నతఁడు నదీతీరముననే చాలదూరము నడచెను. చివరకు ఛేదనయోగ్య మగు వృక్ష మొకటి కాన్పింపఁ దనకుఁ గావలసిన కట్టెలుకొట్టి యతఁడు మోపుగాఁ గట్టెను, కాని యదిమోసికొనివచ్చుట యతనికిఁ జాలఁగష్టమయ్యెను. నవకుమారుఁడు దరిద్రుల యింటఁ బుట్టినవాఁడు కాఁడు. అందుచే నతని కిట్టిపనులు చేయుట యభ్యాసము లేదు. చక్కగా నాలోచింపక కట్టెలు దెత్తునని మొదట నతఁడు బయలుదేఱి వచ్చెను; కాని యిప్పుడు మోసికొని పోవుట కష్టమయ్యెను. ఏది యెట్లున్నను నేదేని కార్యముదలపెట్టి కొంతవఱకుఁ జేసి వదలివేయుట నవకుమారుని స్వభావము కాదు. అందుచే నతఁడు కట్టెలమోపు నెట్లో మోసికొని రానారంభించెను. కొంతసేపు మోయుచు మోపు క్రిందవైచి కొంతసేపు విశ్రాంతి నొందుచు మరల మోయుచు విశ్రాంతి

నొందుచు నతఁ డామోపు మోసికొని వచ్చుచుండెను.

ఈ హేతువుచే నవకుమారుని పరిత్యాగమున మాలస్యమగుచుండెను. తోడియాత్రికు లతని యాలస్యమున కుద్విగ్నలగుచుండిరి. ఇంకను రాకుండుటచే నతఁ డేపులినోటనో పడెనని వారు శంకించుచుండిరి. అతఁడు రాఁదగినకాలము గతించుటచే నతని నేవ్యాఘ్రమో చంపిన దని వారు నిశ్చయించుకొనిరి. కాని తీరముమీఁది కెక్కి కొంచెము దూర మరిగి యతనిజాడఁ గనుఁగొన నెవ్వరు సాహసింప లేదు.

యాత్రికు లీరీతిఁ దలచుచుండు సమయమున జలరాశిలో భయంకరమైన కల్లోలముద్భవించెను. పోటువచ్చుచున్న దని నావికులు తెలిసికొనిరి. జలోచ్ఛ్వాస సమయమునఁ బ్రచండ తరంగములు వచ్చి తీరమునకుఁ గొట్టుకొను ననియు, నట్టి యెడఁ దత్ప్రదేశమున నావ లుండుట తటస్థించెనేని యవి ఖండఖండములై పోవుననియు నావికుల కనుభవమగుటచే వారు తీరమునకుఁగట్టిననావ నూడఁదీసి సత్వరముగా నదీ మధ్యమునకుఁ దోసికొనిపోవ యత్నించుచుండిరి. వారుదాని కట్టు వదలించిరో లేదో యప్పుడే యెదుటనున్న సైకతభూమి యంతయు నీటమునిఁగిపోయెను. యాత్రికుల భోజనసామాగ్రి యంతయు నప్పుడే నష్టమయ్యెను. వారు మాత్ర మతిశీఘ్రముగా ద్రొక్కుడుపడుచు నావయెక్కఁగలిగిరి. దురదృష్టమునకుఁ దగినట్లు నావికు లంత నిపుణులు కాకపోవుటచే నావ నాపలేకుండిరి. ప్రబలప్రవాహవేగముచే నావ రసుల్పుర నదీమధ్యమునఁ గొట్టుకొనిపోవసాగెను. యాత్రికులలోనొకఁడు

"నవకుమారుఁడు వచ్చినాఁడా" యనెను. "ఆ! ఇంకెక్కడి నవకుమారుఁడు! ఆయన నేతోఁడేలో చంపివేసినది" అని నావికుఁ డొకఁడు ప్రత్యుత్తర మిచ్చెను.

మహావేగమున నావ రసుల్‌పురనదిలోఁ బోవుచుండెను. తిరిగి వచ్చుట దుర్ఘటము. అయినను నావికులు తమశక్తినంతయు వినియోగించి రసుల్‌పురనదినుండి నావనుద్రిప్ప సకల ప్రయత్నములు చేయుచుండిరి. వారెంత శ్రమపడిరో చెప్ప లేము; ఆమాఘమాసమున వారివదనములనుండి స్వేదబిందువులు స్రవించెను. వారెంతో శ్రమపడి రసుల్‌పురనదినుండి చివరకు నావను ద్రిప్పఁగలిగిరి. కాని యెంతవఱకుఁ దిరిగెనో యక్కడనుండి యది ప్రబలతర ప్రవాహవేగమున నుత్తరాభిముఖముగాఁ బోవసాగెను. నావికులు దాని నించుకైన నిరోధింప లేకపోయిరి. నావ మరలినది కాదు.

ప్రవాహవేగము తగ్గిపోయి నావ నాపుటకు వీలగునప్పటికి నావికులు రసుల్‌పురము రేవు దాఁటి చాలదూరము పోయిరి. అప్పుడు నవకుమారుని కొఱకు, దిరిగిపోవలయునా యక్కఱలేదా యను మీమాంస తీవ్రముగాజరిగెను. నావయందున్నవారెల్లరుఁ దోడియాత్రికులే కాని నవకుమారుని బంధువు లొక్కరును లేరు. యాత్రికు లీవిధముగా నాలోచింపఁదొడఁగిరి: "ఇచటనుండి తిరిగిపోవుట కేవలముమూర్ఖపుబని. తరువాతఁ జీఁకటిలో నావను గదలింపరాదు. అందుచే

మఱునాఁటి సముద్రపుఁబోటు ప్రారంభమగువఱకుఁ బ్రతీ
క్షింపవలయును. అంతవఱ కందఱు భోజనము లేకుండవల
యును. రెండుదినములు వరుసగా భోజనము లేకుండిన నంద
ఱును గంతగతప్రాణు లగుదురు. అంతేకాక నావికు లిందుల
కంగీకరింపరు. మనమాట చొప్పునఁ దిరిగి రావలసిన బాధ్య
తయు వారికి లేదు. నవకుమారుఁడే పులినోటనో యే తోఁ
డేలు నోటనో పడి చనిపోయియుండునని వా రిదివఱకే చెప్పి
యున్నారు. వారు చెప్పినది నిజముగూడఁ గావచ్చును. ఇట్టి
సందర్భమున మన కింత శ్రమ మెందులకు ?''

ఈపగిది నాలోచించి యాలోచించి నవకుమారుని వెదుక
బోవు ప్రయత్నము మాని స్వదేశమునకుఁ బోవుటయే
శ్రేయమని చివరకు యాత్రికులు నిశ్చయించుకొనిరి. భయం
కర మగు సముద్రతీరమున నరణ్యములో నవకుమారుఁడు విస
ర్జింపఁబడినవాఁ డయ్యెను.

## 3

యాత్రికులు నవకుమారుని వదలిపెట్టిన స్థలమునకు సమీప
ముగా దౌలత్పురము దరియాపురము నను రెండుగ్రామము
లిప్పుడు కనఁబడుచున్నవి. అంతేకాక యా ప్రదేశమున నీ
కథాకాలము నాఁటికి జననివాసచిహ్నములు గూడ లేవు;
అంతయు నరణ్యము. వంగదేశమం దుండునితరప్రదేశములవలె

నియ్యుది వ్యవసాయమున కనుకూల మైనభూమి కాదు. రసుల్
పురము సరిహద్దునుండి సువర్ణరేఖవఱకు నెన్నియో యో
నముల పొడవున వాలుకాస్తూపములువ్యాపించియున్నవి. ఇవి
గొంచె మున్నతముగ నున్నచో వీనిని జిన్ని చిన్ని కొండ లన
వచ్చును. ఇప్పు డవి "ఇసుకకొండ" లని వ్యవహరింపఁబడు
చున్నవి. ఈ సైకతస్తూపముల ధవళశిఖరములు మధ్యాహ్న
సూర్యకాంతిలో నపూర్వశోభ గొల్పుచుండును. వీనిపై గొప్ప
వృక్షములు పెరుఁగవు. పాదములందుఁ జిన్న చిన్న పొదలు
మాత్రము పెరుఁగును. అయినను వీని మధ్యభాగములును శిఖ
రములును ఛాయారహితములై ధవళశోభచేఁ గనుల మిఱుమి
మిట్లు గొల్పుచుండును. అథోభాగమందుండువృక్షములలో
గురువకవృక్షములును నరణ్యపుష్పములును మొదలు.

ఇట్టి నిరానంద ప్రదేశమందు యాత్రికులు నవకుమారుని
విడిచిపోయిరి. ఆతఁడు మొదటఁ గాష్ఠములు మోసికొనుచు
నదీతీరమునకు వచ్చి చూచునప్పటికి నావ కనఁబడ లేదు.
అప్పు డతని కాకస్మికముగా భయము కలిగెను. కాని తోడి
యాత్రికులు తన నీరీతి విడిచిపోవుదు రని యతఁ డనుకొన
లేదు. పోటు వచ్చినపుడు సైకతభూమి మునిఁగిపోవుట చే
యాత్రికులు సమీపముననే యింకొకచోట నావను ప్రవాహ
వేగమునుండి రక్షించుకొనుచున్నా రనియుఁ ద్వరలో వారి
గనుఁగొన వచ్చు ననియు నవకుమారుఁ డనుకొనెను

ఈయాశచే నతఁడచటనే కూర్చుండి వారికై యెదురుచూచు చుండెను. కాని నావ యెంతసేపునకు రాలేదు. యాత్రికులలో నొక్కరును గాన రాలేదు. నవకుమారుని కాఁకలి బాధ హెచ్చుచుండెను. ఇఁకఁ బ్రతీక్షింపఁ జాలక యతఁడు నదీతీరము వెంటనే వెనుకఁబోయెను. ఎచ్చటను నావజాడ కనుపించలేదు. తిరిగి యతఁడు మొదటిచోటికి వచ్చెను. అంతవఱకును నావ కాన్పింపకుండుటచేఁ బ్రవాహవేగమున నయ్యది కొట్టుకొని పోయిన దనియు, యాత్రికు లెంతప్రయత్నించినను బ్రతికూల ప్రవాహవేగముచేఁ దిరిగి రా నాలస్యమగుచున్న దనియు నతఁడు భావించుచుండెను. కాని పోటు వడి తగ్గిపోయినది. ఇప్పుడీ పాటుసమయమున నావ తప్పక రాఁగలదని యతఁ డనుకొనెను. కాని పాటుకూడఁ గ్రమముగా నెక్కుడయ్యెను. సూర్యుఁడు కూడ నస్తమించెను. నావ తిరిగి వచ్చునెడ నిదివఱకే వచ్చియుండ వలసినది.

పోటుసమయమున సముద్రకల్లోలములో నావ మునిఁగి పోయి యుండును. కానిచోఁ దోడియాత్రికు లీ నిర్జనారణ్యమునఁ దనను విడిచిపోయియుండ రని చివరకు నవకుమారుఁడు నిశ్చయించుకొనెను.

అతఁ డొక్కసారి దిక్కులు కలయఁ జూచెను. గ్రామము లేదు, జనులు లేరు, ఆశ్రయము లేదు, ఆహారము లేదు, పానీయము లేదు. నదీజల మత్యంత లవణాత్మకము. ఇంతేకాక క్షుధాతృష్ణలచే నతనిహృదయ మార్చుకొని పోవుచుండెను.

దుస్సహ మగుచలిలోఁ దలఁ దాఁచుకొన నాశ్రయము లేదు.
తుషారశీతల వాయువు వీఁచుచుండ, హిమము వర్షించుచుండ,
నదీతీరమం దాశ్రయము లేక యాచ్ఛాదనము లేక యతఁడు
పరుండవలసి వచ్చెను. "నిశీథమున వ్యాఘ్రభల్లూకాదులు
వచ్చిన రావచ్చును. మరణము నిశ్చయ" మని యతఁడు
భావించుచుండెను.

మనస్సు సంచలించుచుండుటచే నవకుమారుఁ డొక్క
చోట స్థిరముగాఁ గూర్చుండ లేకుండెను. అంత నతఁడు తీరము
మీఁదికిఁ బోయి యటునిటుఁ దిరుగ నారంభించెను. క్రమ
ముగా నంధకారము వ్యాపించెను. నవకుమారుని స్వగ్రామ
మందునలెనే శిశిరాకాశమున నక్షత్రము లుదయించు
చుండెను. చీఁకటిలో నెటుఁజూచినను నేమియుఁ గనుపించు
టలేదు. ఆకాశము, బయలు, నదీముఖము, నంతయు
నిశ్శబ్దముగా నుండెను. అవిరళ కల్లోలిత సముద్రగర్జనమును
మధ్యమధ్యమున నరణ్యమృగముల భీకరారావములును దప్ప
నిం కేవియు వినవచ్చుట లేదు. ఒకప్పు డుపత్యకలందును,
నింకొకప్పు డధిత్యకలందును, వేఱొకప్పుడు స్తూపపాదము
లందును, మఱియొకప్పుడు స్తూపశిఖరములందును, నా కటికి
చీఁకటిలో మంచు గురియుచుండ నిసుకకొండచుట్టును నవ
కుమారుఁడు పరిభ్రమింపఁ దొడఁగెను. అట్లు తిరుగుచుండఁ
బ్రతిక్షణము ఘాతుకమృగములు మీఁదికి వచ్చుచున్నట్లు
తోఁచి యతనికి భయము కలుచుండెను; కాని యొక్కచోఁ

గూర్చుండినను నతని కట్టి భయము పోలేదు.

తిరుగఁ దిరుగ నవకుమారునకు శ్రమమధిక మగుచుండెను: పగలంతయు నిరాహారముగా నుండుటచే నతఁడు మిక్కిలి యలసి పోయెను. అంత నతఁ డొకానొక యిసుకకొండ చెంత వెన్ను వాల్చెను. తన యింటిలోని మెత్తనిపఱుపు లతనికి జ్ఞప్తికి వచ్చెను. శారీరకక్లేశ మధికమై మానసిక విచారము తీవ్ర మగునపుడు నడుమనడుమ నిద్రవచ్చుచుండుట మానవస్వభావము. నవకుమారుఁడు చింతించుచు నిద్రాభిభూతుఁ డయ్యెను. ప్రకృతి యిట్లుండకున్న నప్రతిహతవేగము గల సంసార క్లేశముల నెప్పుడు నెవ్వఁడును సహింపలేఁడు.

## ४

నవకుమారునకు మెలఁకువ వచ్చునప్పటి కర్ధరాత్రమయ్యెను. అంతవఱకును దన నేవ్యాఘ్రముగూడ హింసింపకుండుట కతని కాశ్చర్యము కలిగెను. అతఁ డంతట వ్యాఘ్రాదులు వచ్చుచున్న వేమో కనుఁగొనుటకై తీక్ష్ణముగాఁ జూచెను. అప్పు డాకస్మికముగా నెదుట నతనికి వెలుతురు కనఁబడెను. తనకు భ్రమ కలిగిన దేమో యని నిశ్చయించుటకై యేకాగ్రతతో నతఁ డావెలుఁగువంకనే చూడ నారంభించెను. ఆ ప్రకాశము క్రమక్రమముగా వృద్ధియై యుజ్జ్వలతరము కాఁ దొడఁగెను. అది కట్టెలమంట కావచ్చు నని యతఁ డూహించెను.ఊహించినంత మాత్రమున నతని జీవనపుటాశ మరల నుద్దీప్త

మయ్యెను. మనుష్యు లుండనిదే యిట్టిమంటకుఁ గారణ ముండదు. ఏల యన నది కార్చిచ్చు రగులు కాలము కాదు. నవకుమారుఁ డచ్చటనుండి లేచి ప్రకాశము కనఁబడు వైపునకుఁ బరుగెత్త సాగెను. అది కొఱివి దయ్య మేమో! అయినను గావచ్చును. కాని యిట్టి యనుమానము పెట్టుకొనినఁ బ్రాణములు రక్షించుకొనుట యెట్లు? అని భావించుచుఁ బ్రకాశమువైపు లక్ష్యముంచి యతఁడు ధైర్య ముతోఁ బోవసాగెను.

వృక్షములు లతలు వాలుకాస్తూపములు నతని కడుగడుగు నకు గతినిరోధము గలిగింపసాగెను. పొదలు దాఁటుచు, లతలు ద్రెంచుచు, సైకతస్తూపములు లంఘించుచు, నతఁడు పోవుచుండెను. ప్రకాశమును సమీపించి చూడ నత్యున్నత మగు సైకతస్తూపశిరోభాగమున నాయగ్ని మండుచుండుటయుఁ గాంతిలో నాకాశపటమందలి చిత్రమువలె మనుష్యమూర్తి కూర్చుండి యుండుటయు నతనికిఁ గనఁబడెను. శిఖరాసీనుఁ డగు మనుష్యుని సమీపింప స్థిరసంకల్పుఁడై యశిథిలీకృత వేగముతో నతఁడు బయలుదేఱెను. స్తూపము నారోహింప నారంభించినంత నతని కొక యనుమానము కలిగినది. అయి నను నతఁడకంపితపదములతో నిసుక కొండ నెక్కుచుండెను. కూర్చుండియున్న యామనుష్యమూర్తి చెంతకరిగి చూడగనే నవకుమారుని శరీరము రోమాంచిత మయ్యెను. అచట నిలు చుటయో కాక తిరిగి పోవుటయో యతఁడు నిశ్చయించుకొన

లేకపోయెను. ఆ మనుష్యమూర్తి కనులు మూసికొని ధ్యానము చేయుచుండెను. నవకుమారు నతఁడు మొదట జూడలేదు. ఆతనివయ స్సేఁబది సంవత్సరము లుండు నని నవకుమారునకు గోచరించెను. అతని నడుమున నేదియేని వస్త్ర మున్నదియు లేనిదియుఁ గానరాలేదు. కటిప్రదేశము మొదలు జానువులవఱకు నతని శరీరము శార్దూలచర్మావృతము. అతని కంఠమున రుద్రాక్షమాలికలును, శిరస్సున జటాజూటమును, మోమున గడ్డము మీసములును గలవు. ఆతని యెదుటఁ గాష్ఠాగ్ని మండుచుండెను. ఆ యగ్ని కాంతిని జూచియే నవకుమారుఁ డా స్థలమునకు రాఁ గలిగెను. అతని కంతట నసహ్యమైన దుర్గంధము కొట్టెను. ఆ ధ్యాని కూర్చున్న యాసనమువంకఁ జూచినంతనే యతని కా దుర్గంధకారణము తెలిసిపోయెను. ఆ జటాధారి మొండెముపైఁ గూర్చుండి యుండెను. అతని యెదుట నున్న నర కపాలములను వానిలో నెఱ్ఱని ద్రవపదార్థములను జూచినంతనే నవకుమారునకు భయము కలిగెను. నలువైపుల నెముకలు పడియుండెను. ఇంతయేల ? ఆ యోగాసనాసీనుని కంఠమందలి రుద్రాక్షమాలలోఁ గూడఁ జిన్నిచిన్ని యెముకముక్క లున్నవి. నవకుమారుఁడు ముగ్ధుఁడై పోయెను. ముందునకుఁ బోవుటకుఁ గాని యా స్థలము వీడుటకుఁ గాని యతనికిఁ దోఁచలేదు. అతఁ డిదివఱకుఁ గాపాలికుల సంగతి వినియుండుటచే నా పురుషుఁడు కాపాలికుఁ డనుకొనెను.

నవకుమారుఁడచటికి వచ్చునప్పటికిఁ గాపాలికుఁడు మంత్ర సాధనమునందో ధ్యానమునందో మగ్నుఁడై యుండెను. తరువాత నతఁడు నవకుమారునిఁ జూచి భ్రూక్షేపమునైనను జేయ లేదు. కొంతసే పయిన తరువాతఁ గాపాలికుఁడు "కస్త్వమ్" అని నవకుమారుని సంస్కృతభాషలోఁ బ్రశ్నించెను. "నేను బ్రాహ్మణుఁడ" నని యతఁ డనెను.

కాపాలికుఁడు "తిష్ఠ" అని మాత్రము వచించి మరల ధ్యానమగ్నుఁ డయ్యెను. నవకుమారుఁ డట్లే నిలుచుండెను. ఈరీతి నాలుగైదుగడియలు కడచెను. చివరకుఁ గాపాలికుఁడు లేచి పూర్వమువలె సంస్కృతమున నవకుమారునితో "మామనుసర" అని పలికెను.

ఇంకొక సమయమందు నవకుమారుఁ డెప్పుడు నిట్టివాని వెంట నరిగియుండఁ డని నిశ్చితముగాఁ జెప్ప వచ్చును. కాని యిప్పుడు క్షుధాతృష్ణలచేఁ బ్రాణములు కంఠగతము లగుట వలన నతఁడిట్లు బదులు పలికెను: "చిత్తము, స్వామీ! కాని నే నాఁకలిదప్పులచే మిక్కిలి బాధపడుచున్నాను. ఎచటికిఁ బోయిన నా కాహారము దొఱకునో సెల విండు!"

అంతఁ గాపాలికుఁడు "భైరవీప్రేరితోఽసి, మామనుసర, పరితోషం తే భవిష్యతి" యనెను.

నవకుమారుఁడు కాపాలికునివెంటఁ జనెను. ఇరువురును జాలదూరము నడచిరి; మార్గములోఁ బరస్పర మేమియుమాటలాడ లేదు. కొంతసేపునకు వారికిఁ గుటీరముకనఁబడెను. కాపా

లికుఁడు మొదట నా కుటీరములోనికిఁ బోయి నవకుమారుని లోపలికి రా నాజ్ఞాపించెను. అతఁ డెట్లో కాష్ఠము వెలిగించి నవకుమారునకు వెలుతురు చూపెను. ఆ కుటీరమునందుమ వ్యాఘ్రచర్మము జలకలశము కొన్ని ఫలమూలములును గలవు.

కాపాలికుఁ డిట్లనెను: "ఈ ఫలమూలములు భక్షింపుము. కొన్ని కుట్టి యాకలశములోని జలము త్రాగుము. నీకిష్టమైన యెడల నీ వ్యాఘ్రచర్మముపైఁ బరుండుము. భయపడకుము. పులులు రావు. ఇంకొకసమయమున నీకు నాదర్శనముకాఁగ లదు. నేను వచ్చునంతవఱకు నీవీకుటిరమును వదలి పోవ కుము."

ఇట్లని కాపాలికుఁడు వెడలిపోయెను. నవకుమారుఁ డా ఫలములను భుజించి కొంచె ముప్పగా నున్న కలశోదకమును త్రాగి పరమానందము ననుభవించెను. తరువాత నతఁ డా వ్యాఘ్రచర్మముపైఁ బరుండెను. పవ లంతయు నలసియుండు టచే నతనికిఁ ద్వరలో నిద్ర పట్టెను.

౫

ప్రాతఃకాలమున లేచి నవకుమారుఁ డిల్లు చేరు నుపాయ మాలోచింపసాగెను. విశేషించి యా కాపాలికుని సాన్నిధ్య మతని కెంతమాత్రము శ్రేయస్కరముగాఁ దోఁచలేదు. కాని ప్రప్రథమమున మార్గహీనమగు నీయరణ్యమునుండి బయటఁ

బడుట యెట్లు? మార్గముఁ గనుఁగొని యిల్లు చేరు టెట్లు? కాపాలికునకుఁ దప్పక నీమార్గము తెలిసియుండును. అడిగిన చెప్పునో చెప్పఁడో, కాని యెంతయాలోచించినను గాపాలికుఁడు తనవిషయమై యేమాత్ర మనుమానాస్పదముగఁ బ్రవర్తించియుండలేదు. అట్లయినఁ దాను భయపడనేల? అది యట్లుండఁ గాపాలికుఁడు మరలఁ గనుబడువఱకుఁ గుటీరము వదలిపోవల దని నిషేధించియుండెను. అతనియాజ్ఞ నతిక్రమించిన నతనికిఁ దప్పక కోపము రావచ్చును. కాపాలికులు మంత్రబలముచే నసాధ్యమయిన దానిని సాధింపఁ గల రని నవకుమారుఁ డదివఱకు వినియుండెను. ఈ కారణములచే నతఁడు కాపాలికుని యాజ్ఞ నతిక్రమించుట యనుచిత మని యాలోచించి కుటీరమున నుండుటకే నిశ్చయించుకొనెను.

క్రమముగా నపరాహ్ణ మగుచుండెను. కాపాలికుఁడింకను దిరిగి రాలేదు. వెనుకటిరోజుపవాస ముండుటచేతను నేఁడింత వఱకు భుజింపకుండుటచేతను నవకుమారున కాఁకలి బాధ దుర్భరము కాసాగెను. కుటీరములో ఫలమూలములు కొలఁదిగ మాత్రమే కలవు. వాని నతఁడు రాత్రియే భుజించెను. ఇప్పుడు కుటీరము విడిచి ఫలాన్వేషణమునకై పోవకున్న నాఁకలిచేఁ బ్రాణములు పోవును. ప్రొద్దు కొంచెమే కలదు. ఆఁకలిబాధ దుర్భర మగుటచే నవకుమారుఁడు ఫలాన్వేషణమునకై బయలువెడలెను.

ఫలములకై చెంత నున్న యిసుకకొండలకు నలువంకలఁ

రుగుచు నతఁడు వానిని దాఁటిపోయెను. అచ్చటచ్చటఁ జెదరి
ున్న వృక్షములనుండి ఫలములు గోసికొని తినుచు దన
ఁాఁకలి బాధ నివారించుకొనెను.

అచటి యిసుకకొండలనెత్తము చాలఁ జిన్నదగుటచేఁ
ొలఁదికాలములోనే నవకుమారుడు దానిని దాఁటిపోయెను.
రువాత నతఁడిసుకదిబ్బలు లేని సాంద్రారణ్యమునఁ బడెను.
వరైనఁగొంతసే పపరిచితము మార్గవిహీనము నగునడవిలో
రుగుచుండి రేని వారి కాయరణ్యమునఁ ద్రోవ దొరకవచ్చు
ని యాశ పుట్టును. నవకుమారున కట్టే త్రోవ దొరకెను.
మార్గమునఁ గొంతదూరము పోయినతరువాత నతఁడు కాపా
కాశ్రమమునుండి యేదిక్కునకుఁ బోవుచున్నదియుఁ దెలిసి
ొన లేకపోయెను. గంభీరమగు కల్లోలధ్వాన మతనికి విన
చ్చెను.అది సాగరగర్జన మని యతఁడు తెలిసికొనెను. కొంత
ుపు నడచిన తరువాతఁ దటాలున నరణ్య మంతమయి పోవ
ముద్రతీర మతనికిఁ గనఁబడెను. అనంత మగునీలాంబురాశిని
ాచినంతనే యతనిహృదయ మొక్కసారిగా నత్యంతానంద
ున నోలలాడెను. అంత నతఁడు సాగరతీరమునఁ గూరుచుం
ెను. అంతయు ఫేనమయము, నీలము నపారము నగు పారా
ారము! పార్శ్వములం దెంతవఱకు దృష్టి సారించినను దరంగ
ులచేఁ గొట్టుకొనివచ్చు నురుగులే! రాశీకృత మగు స్వచ్ఛ
ుసుమమాలలవలె నా ఫేనరేఖలు సువర్ణచ్ఛాయగల యిసుక
డుకలపై వచ్చి పడుచుండెను. కాననకుంతల యగు భూదేవి

కుపయుక్తములగు నలకాభరణములవలె నీలజలరాశిలో నంత
టను దరంగ భంగములనుండి నురుఁగులు వెడలుచుండెను.
ప్రచండ వాతముచే నక్షత్రములు గుంపులు గుంపులుగా స్థాన
చ్యుతములయి నీలాంబరమున నల్లకల్లోల మయ్యోనేని యప్పు
డీసాగరభంగ విక్షేప స్వరూపము గోచరించును. ఈ సమయ
మున నస్తంగతుఁ డగుచున్న దినమణి మృదుల కిరణములచే
నీలజలరాశి యందొక భాగము కరఁగి పోసిన బంగారు కాంతు
లీనుచుండెను. చాలదూరమునఁ బాశ్చాత్య వర్తకుల నౌక
యొకటి తెల్లని తెరచాపల నెత్తి మహావిహంగమువలె సముద్ర
వక్షమునఁ దేలియాడుచుండెను.

నవకుమారుఁ డెంతకాల మారీతిఁగూర్చుండి సముద్ర
శోభనుజూచి యానందించుచుండెనో యతనికిఁ దెలియదు
తరువాత నొక్కసారిగాఁ బ్రదోషతిమిర మేతెంచి నీలోదక
ములపైఁ బడెను. కాపాలికాశ్రమమునకు, బోవలయునని
నవకుమారున కప్పుడు చైతన్యము కలిగెను. అతఁ డంతట
నిట్టూర్పు విడిచి యచటనుండి లేచెను. దీర్ఘముగా నేల
నిశ్వసించెనో చెప్పలేము. అప్పుడతని కనుభూతపూర్వ మగు
నేసుఖము జ్ఞప్తికి దగిలెనో యెవరు చెప్పగలరు? అంతట
నతఁడు సముద్రతీరము నుండి వెనుకకు మరలెను. తిరిగిన
తోడనే యతని కొకయపూర్వమూర్తి కానవచ్చినది. గంభీర
ముగ గర్జించుచున్న యాసాగరతీరమున సైకతభూమియందు
నస్పష్టసంధ్యాలోకములో నా యపూర్వతరుణీమూర్తి నిలు
చుండి యుండెను. ఆవేణీసంబద్ధము సంసర్పితము రాశీకృతమ

నగు నామె కేశభారము జానువులవఱకు వ్రేలాడుచుండెను. కేశములకుఁ బురోభాగమున నామె దేహరత్నము పటముపైఁ జిత్రించిన రూపమువలెఁ గన్పట్టుచుండెను. ముంగురులు దట్టముగాఁ గ్రమ్మియుండుటచే ముఖమండలము సంపూర్ణముగాఁ గానవచ్చుట లేదు. అయినను మేఘములను జీల్చుకొనివచ్చు శశాంకబింబమువలె నామెవదన మండలము ప్రకాశించుచుండెను. ఆమె కడగంటిచూపులు స్థిరములు గంభీరములు జ్యోతిర్మయములు! ఆమె కటాక్షములు సముద్రహృదయమునఁ గ్రీడించు చంద్రకిరణములవలె నతిస్నిగ్ధములయి ప్రకాశించుచుండెను. కేశరాశి యామె స్కంధదేశమును, బాహుయుగ్మములను, నావరించియుండెను. ఆమె భుజము లొక్కసారిగా గనఁబడుట లేదు; బాహువులనిర్మలశోభ మాత్రము దృగ్గోచర మగుచుండెను. ఆమె నిరాభరణ. ఆమె యాకారమందలి సమ్మోహశక్తి మాత్రము వర్ణింపజాలము. ఆమె శరీరచ్ఛాయ బాలచంద్రుని కాంతివంటిది. చికురజాలము సాంద్రనీల మేఘమువంటిది” ఆహా! ఏమి యామె మేనిచాయ, యేమి యామె శిరోజములు! ఆ రెండును నెట్లు శోభిల్లుచున్నవో తెలియవలె నన్న నా గంభీరనినాదియగు సాగరతీరమున సంధ్యాలోకములోఁ జూడనిచో వాని మోహినీశక్తి యనుభూతము కాఁజాలదు.

నిర్మానుష్య మగు నాసముద్రతీరమున వారు చాల సేపు పరస్పరమారీతిఁ జూచుకొనుచు నిలువఁబడిపోయిరి. మఱికొంత

నేపైనతరువాత నాయువతి కంఠస్వరము వినవచ్చెను. ఆమె మృదుమధుర స్వరముతో "పాంథుఁడా! త్రోవఁ దప్పితివా?" యనెను.

ఆమె కంఠస్వరముతో పాటు నవకుమారుని హృదయ వీణయు మ్రోఁగెను. ఎంత ప్రయత్నించినను బరస్పరసమ్మేళ నముఁ గల్గుకుండునట్లు హృదయవీణాతంత్రు లప్పుడప్పుడు శ్రుతి తప్పుచుండును. కాని యొక్క-కంఠధ్వనిచే—నొక్క-కామినీకంఠధ్వనిచే వానిని శ్రుతిచేయవచ్చును. అప్పుడు తంత్రు లన్నిటికిని శ్రుతి కుదురును. నాఁటినుండి సంసార యాత్ర సుఖమయ మగు సంగీతలహరి యని యనుభూత మగును. అట్టి ధ్వని నవకుమారుని కర్ణములలో మ్రోఁగెను.

"పాంథుడా! త్రోవఁ దప్పితివా?" అను నీ మాటలు నవకుమారుని చెవిఁ జొచ్చెను. ఆ ధ్వని కేమి యర్థమో యెట్లు ప్రత్యుత్తర మీయవలయునో యతని కించుకయుఁ దోఁచలేదు. హర్షవికంపిత మగు నాధ్వని వాయువునందు వ్యాపించినట్లును, వృక్షపర్ణములందు మర్మరిత మైనట్లును, సాగరఘోషమున మందీభూత మైనట్లును నతనికిఁ దోఁచెను. సాగరవసనయగు పృథివీదేవి సుందరముగా నుండెను; తరుణియు సుందరి, ధ్వనియును సుందరముగా నుండెను. అతని హృదయతంత్రులలో సౌందర్యశ్రుతి కుదిరెను.

ప్రత్యుత్తరము రానందున నా తరుణి 'రమ్ము' అని పలుకుచు బయలుదేఱెను. ఆమెయడుగులజాడలు కనఁబడుట లేదు.

వసంతకాలమున మందానిలసంచాలితము లగు శుభ్రమేఘ
ములవలె పాదన్యాసములు కానరాకుండ నామె నడచు
చుండెను. జంత్రపుబొమ్మవలె నవకుమారుఁ డామెవెంటఁ
బోవుచుండెను. ఒకచోట నొక చిన్నియడవిలోఁ దూఱి
వలసివచ్చెను. తరువాత నాజవ్వని కనఁబడలేదు. అడవి
దాఁటి చూడ నతని కెదుటఁ గుటీరము కనఁబడెను.

## ౬

నవకుమారుఁడు కుటీరములోఁ బ్రవేశించి ద్వారమున కాను
కొని శిరముపైఁ జేతు లుంచుకొని కూర్చుండెను. చాలసేపటి
వఱ కతఁడు తల పై కెత్తలేదు.

ఈ వనిత దేవియా, మానవియా, కాక కాపాలికుని
మాయాశక్తియా! నవకుమారుఁడు నిశ్చలముగాఁ గూర్చుండి
కళవళపడసాగెను; కాని యతని కేమియు బోధపడలేదు. అన్య
మనస్కుఁ డగుటచే నతని కింకొక పనిమీఁదికి బుద్ధిపోలేదు.
జలము కొనివచ్చుట యవసరమని తోఁచినను దానిని మాని
యతఁ డా సాయంసమయమునఁ జరిగిన యసంభావ్యవిషయ
మునుగుఱించి తలపోయుచుండెను. చాల ప్రొద్దుపోయినతరు
వాత సాయాహ్నకృత్యము లింకను బూర్తి కాలే దని యత
నికి జ్ఞప్తికి వచ్చెను. అంత నతఁడు తల యెత్తి చూడ నచటఁ
గాష్ఠము మండుచుండెను. ఆ మంటవెలుతురులోఁ దండులాది

భోజన సామగ్రులు కొంచెము కొంచెముగాఁ గానవచ్చెను. నవకుమారుఁ డాశ్చర్యము చెందక "ఇది యంతయుఁ గాపాలికుని పనియే యగును. ఇచ్చట నాశ్చర్య పడవలసిన దేమున్నది!" యనుకొనెను.

నవకుమారుఁడు సాయంకృత్యములఁ దీర్చికొనిన తరువాత నా కుటీరమందున్నమృత్పాత్రతో వంటచేసికొని భుజించెను. మఱునాఁ డుదయమున వ్యాఘ్రచర్మశయ్యనుండి లేచి యతఁడు సముద్రతీరాభిముఖుఁడై పోయెను వెనుకటిదిన మరణ్యములో రెండు పర్యాయములు నడచి యుండుటచే నతఁడు నేఁ డెక్కువ కష్టము లేకుండ మార్గము కనుఁగొనఁ గలిగెను.

ఆతనికిఁ గ్రిందటి దినము కనఁబడిన మాయావిని మరల నచటికి వచ్చు ననెడి యాశ యాతని హృదయమునం దెంత గట్టిగా నాఁటుకొని యుండెనో చెప్పుటకు వీలు లేదు. కాని యతఁ డా ప్రదేశమును వదలి పోలేదు. ఎంతసేపుచూచినను నెవ్వరురాలేదు. అంత నతఁ డా పరిదేశమునకుఁ జుట్టుప్రక్కల దిరుగ సాగెను. అతని యన్వేషణము వృథయైనది. మనుష్య సంచారచిహ్నములుకూడ నతని కగపడలేదు. తిరిగి వచ్చి యతఁడు వెనుకటి స్థలమునఁ గూర్చుండెను. సూర్యుఁ డస్తమించెను. అంధకారము వ్యాపింపసాగెను. అంత నతఁడు హతాశుఁడై కుటీరమునకుఁ దిరిగివచ్చి చూచునప్పటికిఁగాపాలికుఁ డందు నిశ్శబ్దముగాఁ గూర్చుండి యుండెను. నవకుమా

రుఁడు మొదటఁ గుశలప్రశ్నము చేసెను, గాని కాపాలికుఁడు ప్రత్యుత్తర మీయ లేదు.

“ఇంతవఱకు స్వామివారిదర్శనభాగ్యము నాకు లభించలే దేలనో?” యని నవకుమారుఁ డాయన నడిగెను. “స్వకార్యములందు నియుక్తుఁడనై యుంటి” నని కాపాలికుఁడు బదులు పలికెను.

“ఇంటికిఁ బోవఁ గోరిక కలిగినది. త్రోవ తెలియలేదు. దారి బత్తెము కూడ లేదు. స్వామివా రేదేని విహితవిధానమును సెల విత్తు రని గంపెఁ డాశతో నున్నాను” అని నవకుమారుఁ డనెను.

“నా వెంట రమ్ము” అని మాత్రము పలికి యుదాసీన భావముతోఁ గాపాలికుఁ డచటినుండి లేచెను ఇంటికిఁ బోవ నేదియో యుపాయము దొరకఁగలదను నుత్సాహముతో నవకుమారుఁ డాతని వెంట నరిగెను.

ఇంకను సంధ్యారాగము తగ్గలేదు. కాపాలికుఁడు ముందు పోవుచుండ నవకుమారుఁ డాతని వెంట నరిగెను.

ఇంకను సంధ్యారాగము తగ్గలేదు. కాపాలికుఁడు ముందు పోవుచుండ నవకుమారుఁడు వెనుక నడచుచుండెను. ఆకస్మికముగ నవకుమారుని వీఁపుపైఁ గోమలహస్తస్పర్శమయ్యెను. తక్షణమే తిరిగిచూచి యతఁడు నిశ్చేష్టుఁడయ్యెను. ఆజానులంబిత మగు నిబిడకేశరాశిగల యాయరణ్యదేవీమూర్తియే! పూర్వమువలె నామె నిశ్శబ్దముగను నిశ్చలముగను నుండెను. ఎచటినుండిరో యామూర్తి యాకస్మికముగ నవకుమారుని

వెనుకకు వచ్చెను. ఆమె తనపెదవులపై వ్రేలిడుకొని యుం డెను. దానిని జూచి నవకుమారుఁడు తనచు మాటలాడ వల దని యామె సంజ్ఞచేయుచున్న దని గ్రహించెను. మాట లాడవల దని చెప్ప నవసరము లేదు. నవకుమారుఁ డేమి మాటలాడును? అతఁ డట్లే ప్రమాన్పడి నిలిచియుండెను. కాపా లికుఁ డిదియంతయుఁ జూడలేదు. అతఁడు ముందే నడచి పోయెను. ఉదాసీనభావముతోఁ గాపాలికుఁడు వారిమాటలు వినఁబడనంత దూరము పోఁగానే మృదుస్వరమున నా తరుణి యేదియో నవకుమారునితోఁ జెప్పెను. "ఎచటికిఁ బోవు చున్నావు! పోవలదు! తిరిగి పొమ్ము, పాఱిపొమ్ము" అను మాటలు మాత్ర మతనిచెవిఁ జేరెను.

ఈమాటలు మాత్రము పలికి ప్రత్యుత్తరమున కైన నిలువ కుండ నామె వెడలిపోయెను. నవకుమారుఁడు కొంతసేపు విహ్వలుఁడై యామె వెంటఁ బోవలెనని యెంతయు నాతురత పడెను. కాని యాయువతి యెటు పోయినదో యతని కెంత మాత్రము తెలియలేదు. అంత నతఁ డిట్లు తలపోయసాగెను. ఇది యెవరిమాయ? నాకు మతిభ్రమము కలిగినదా? నేను వినిన మాటలు విపత్సూచకములా? అట్లయిన నెవరివలన విపత్తు? తాంత్రికు లెంతయైనఁ జేయఁగలరు. అయినఁ బాఱిపోదునా? పాఱిపోవు టెందుకు? నిన్న బ్రదికినట్లే నేఁడును బ్రదుకఁగలను. కాపాలికుఁడును మనుష్యుఁడే. నేనును మనుష్యుఁడనే!

నవకుమారుఁ డీరీతినాలోచించుచుండఁ గాపాలికుఁడు వెనుదిరిగి చూచి తనవెంట నతఁడు రాకుండుటచే మరలివచ్చి, "ఏందుల కాలస్యము చేయుచున్నావు?" అని యతని నడిగెను.

కాపాలికుఁడు మరలఁ బిలువకముందే నవకుమారుఁ డేమియు మాటలాడక యతని వెంటఁ బోయెను.

కొంచెముదూరము పోయినంత నే మట్టిగోడలుగల కుటీర మొకటి యెదు రయ్యెను. దానిని గుటీర మనుట కన్నఁ జిన్నయి ల్లనిన బాగుండును. గృహమునకు వెనుక నే సికతామయ మగు సముద్రతీరము కలదు. గృహపార్శ్వమునుండి కాపాలికుఁ డాతీరము వెంట నవకుమారునిఁ గొనిపోయెను. ఆసమయమున శరవేగముతోఁ బూర్వము కనఁబడిన యువతి యతనిప్రక్క నడచి పోవుచు నాతని చెవిలో "ఇప్పుడైనను బాఱిపొమ్ము. నరమాంసము లేనిది తాంత్రికులకుఁ బూజాపూర్తి కాదని నీకుఁ దెలియదా?" అని చెప్పిపోయెను.

నవకుమారుని లలాటమున స్వేదబిందువు లుప్పతిల్లసాగెను. దురదృష్టవశమున నా యువతి యనినమాటలు కాపాలికునకు వినఁబడెను. కాపాలికుఁడు "కపాలకుండలా"అనెను. అతని కంఠస్వరము మేఘగర్జనమువలె నవకుమారునకు వినఁబడెను. కాని కపాలకుండల బదులు పలుక లేదు.

కాపాలికుఁడు నవకుమారుని హస్తములు పట్టుకొని తీసికొని పోసాగెను. మనుష్యఘాతుకుని కరస్పర్శముచే నవకుమారుని నాడులందు రక్తము నూఱురెట్లెక్కువగాఁ బ్రవ

హించెను. బోయిన ధైర్యమును మరలఁదెచ్చుకొని నవకుమారుఁడు "చేతులు వదలుఁడు''అని పలికెను. కాపాలికుఁడు బదులు పలుక లేదు. నవకుమారుఁడు మరల "నన్నెచ్చటికిఁ గొనిపోవుచున్నా''రని యడిగెను.

"పూజా ప్రదేశమునకు."

"ఎందులకు?"

"వధించుటకు."

అతివేగముతో నవకుమారుఁడు తన చేతులులాగికొనెను. సామాన్యమానవుఁ డెవ్వఁడేని యపుడు నవకుమారుని చేతులు పట్టుకొనియున్న యెడల యీ లాగుటలోఁ బట్టు నిలుపుకొన లేకపోఁగా నేలపైఁ బడియుండును; కాని కాపాలికుఁ డేమాత్రము కదలలేదు. నవకుమారునిముంజేతులాతని పిడికిటిలో నుండిపోయెను. అతనిముంజేతిప్రేళ్లు విఱిగిపోయినట్లయ్యెను. బలముచే లాభము లేదనియు, బుద్ధికౌశలముచేఁ బ్రయోజనము కలుగవలెననియు నవకుమారుఁ డపుడు తెలిసికొనెను. "మంచిది చూచెదగాక!" యనుకొని స్థిరమనస్కుఁడై యతఁడు కాపాలికునివెంటఁ జనెను.

సైకతస్తూపోపరిభాగమునకుఁ బోయినంతనే నవకుమారునకుఁ బూర్వమువలెఁ బెద్ద కాష్ఠ మొకటి కాలుచుండుటయు దాని చుట్టును దాంత్రికపూజా పరికరములును, వానినడుమ నరకపాలమునిండ రక్తమును గనఁబడెను. కాని శవము కనుపించ లేదు. "నేను శవ మగుదును కాఁబోలు!'' అని నవ

కుమారుఁ డను కొనెను.

ఎండిపోయిన గట్టితీఁగెలు కొన్ని యంతకుఁ బూర్వమే, యచట సిద్ధముగా నుండెను. కాపాలికుఁడు వానితో నవకుమారుని దృఢముగా బంధింప నారంభించెను. అతఁడు సాధ్యమైనంతవఱకుఁ దనబలమును వినియోగించి చూచెను. కాని యందువలన నెంతమాత్రము ప్రయోజనము కనఁబడ లేదు. అంతవయస్సునఁగూడ కాపాలికుడు మత్తమాతంగమువలె బలిష్ఠుఁ డని నవకుమారునకుఁ దెలిసిపోయెను. అతని పట్టుదల చూచి కాపాలికుఁడు "ఏల పెనఁగులాడెదవు? మూర్ఖుఁడా, నీజన్మము నేఁడు సార్థకమగును. నీ మాంస పిండము నేడు భైరవీపూజ కర్పణము కాఁగలదు. నీ వంటివాని కింతకన్న సౌభాగ్యముండునా?" యనెను.

కాపాలికుఁడు నవకుమారుని దృఢముగా బంధించి యిసుకపైఁ బడవైచి వధార్థము ముందుగాఁ జేయవలసిన పూజాదుల నారంభించెను. అంతవఱకును నవకుమారుఁడు బంధనములు త్రెంపివేయఁ బ్రయత్నించుచునే యుండెను. కాని యా యెండుతీఁగె లతికఠినములు, బంధనము లతిదృఢములు. మృత్యు వాసన్నమైనది! నవకుమారుఁడు తనచిత్తము నిష్ట దేవతా చరణములందు నిల్పెను. జన్మభూమి యతని కొకసారి జ్ఞప్తికివచ్చెను. సౌఖ్యస్థాన మగుఁ దనగృహము మనస్సునకుఁ దగిలెను. బహు కాలమునుండి వీడియున్న జననీ జనకుల ముఖము లతని మనస్సు నెదుటఁ గనబడెను. ఒకటి

రెండశ్రుబిందువులు జాఱి యిసుకలోఁ బడి యింకిపోయెను బలికిఁ బూర్వ మొనర్పవలసిన క్రియలన్నియుఁ బరిసమాప్తి నొందినంతనే వధార్థము ఖడ్గము గొనివచ్చుటకై కాపాలికుఁ డాసనమునుండి లేచిపోయెను. కాని పెట్టినచోట ఖడ్గము కనఁబడలేదు. ఆశ్చర్యము! కాపాలికుఁ డించుక విస్మితుఁ డయ్యెను. అపరాహ్ణమందే ఖడ్గము గొనివచ్చి తగుచోటఁ నుంచితి ననియు, మరల నింకొకచోటఁ బెట్టలే దనియు నతని దృఢవిశ్వాసము. అయిన ఖడ్గ మే మైనది? కాపాలికుఁడు ఖడ్గముకొఱ కక్కడక్కడ వెదకెను. ఎచ్చటను నది కని పించలేదు. పిదప వెనుకటి కుటీరమువంకఁ దిరిగి యతఁడు కపాలకుండలా యని పిలిచెను. కాని యెన్నిసారులు పిలిచి నను కపాలకుండల బదులు పలుకలేదు అంతట నేత్రములెఱ్ఱ వాఱి కనుబొమలు ముడివడ నతఁ డాకుటీరమునకుఁ బరు వెత్తెను. ఈయవకాశములో లతా బంధనములఁ ద్రెంచు కొనుటకై నవకుమారుఁడు మరల నొక్కతూరి ప్రయత్నము చేసెను. కాని యదియు నిష్ఫల మయ్యెను.

ఇట్టి సమయమునఁ జెంతనే యిసుకపై మృదుపదముల చప్పుడు వినవయ్యెను. అయ్యది కాపాలికునిది కాదు. నవ కుమారుఁడు శిరముఁ ద్రిప్పి చూచెను. ఆ మోహిని, యా కపాలకుండల యతనికిఁ గనఁబడెను. ఆమె చేతియందు ఖడ్గ ముండెను.

ఊరకుండుము, మాటలాడకుము! ఖడ్గము నాకడనే

యున్నది. నేను రహస్యముగాఁ గొనివచ్చితిని” అనుచు కపాలకుండల సత్వరము నవకుమారుని లతాబంధమును ఖడ్గముతో ఛేదించెను. నిమేషకాలములో నామె యతనిని విడిపించి, “పాఱిపొమ్ము వెనుకనే వచ్చి నేను త్రోవ చూపెదను” అని పలికెను.

ఇట్లు చెప్పుచు కపాలకుండల బాణవేగముతోఁ ద్రోవచూపించుచు వెడలెను. నవకుమారుఁడు నామె ననుసరించుచుఁ బోయెను.

౭

ఇచటఁ గాపాలికుఁడు ఖడ్గమునకై కుటీరములో బాగుగ వెదకసాగెను. ఖడ్గముఁ గపాలకుండలయుఁ గనఁబడకపోవుటచే సంశయ మంది మరల నతఁడు సైకతస్తూపమునకు వచ్చెను. అచట నవకుమారుఁడు లేకుండుటచే నత్యంతాశ్చర్య మొందెను. కొంతసేపైనతరువాతఁ దీఁగె లతనికి గానవచ్చెను. అప్పు డతఁడు జరిగిన సంగతి యంతయు గ్రహించి నవకుమారుని వెదకుటకై పరుగెత్తఁ దొడఁగెను. కాని నిర్మనుష్య ప్రదేశమున విహంగము లేయేదిక్కులకుఁ బోవునో నిర్ణయించుట దుస్సాధ్యము. చీఁకటి యగుటచే దేనిని గూడ గుర్తించుట కతనికి సాధ్యము కాకుండెను. అందుచే నతఁడు మాటల సవ్వడి వినఁబడు నేమో యని యటునిటుఁ దిరుగఁదొడఁగెను. కాని యెంతసేపు తిరిగినను గంఠధ్వని యతనికి వినరాలేదు. అందుచే నతఁ డన్ని దిక్కులు సమగ్రముగా నొక్కసారి

చూడ నెంచి యెత్తైన యిసుకకొండ యెక్కెను. కాపాలికు
డాకొండ కొక వైపుగా నెక్కెను. రెండవవైపు వర్షజల
ప్రవాహముచేఁ గోసికొని పోవుచుండెను. ఇది యతనికిఁ
దెలియదు. అతఁ డా కొండకొనకుఁ బోయినంతనే పతనోన్ము
ఖమైన యాస్తూపశిఖర మతని శరీరభారముచే విరిగి భయంక
రారవముతోఁ బడిపోయెను. దానితోఁ బర్వతశిఖరమునుండి
జాఱినమహిషమువలెఁ గాపాలికుఁడును బడిపోయెను.

## ౮

రాత్రివేళ నా కటికి-చీఁకటిలో నూర్ధ్వశ్వాసముతో వా రిరు
వురు నరణ్యములోఁ బ్రవేశించిరి. అరణ్యమార్గము నవకు
మారున కపరిచితము. అందుచే నతనికి సహచారిణి యగు
నా పదునాఱేండ్ల జవ్వని ననుసరించిపోవుట తప్ప నింకొక
యుపాయము లేకుండెను. "ఇది యంతయు నా లలాటమున
వ్రాసియున్నది కాబోలు" అని యతఁడు లోలో నను
కొనుచుండెను. స్థితిగతులు వంగదేశీయుని వశపఱచు
కొను ననియు వంగదేశీయుఁడు స్థితిగతులను వశముచేసికొనఁ
జాలఁడనియు నతఁ డెఱుఁగడు. క్రమముగా వారు గమన
వేగము తగ్గించి నడవఁదొడఁగిరి. అంధకారములో నేమియుఁ
గనఁబడుట లేదు. ఎచటనో యొక్క వాలుకాస్తూప
ధవళ శిఖరము మాత్రము నక్షత్ర కాంతిలో నస్పష్ట

మసగాఁ గానవచ్చుచుండెను. ఎచటనో మిణుఁగురుఁ బురువుల కాంతిలో వృక్షశాఖ లచ్చటచ్చటఁ గనఁబడుచుండెను.

కపాలకుండల నవకుమారునడవిలో నేకాంతప్రదేశమునకుఁ గొనివచ్చి చేరెను. అప్పు డర్ధరాత్రియయ్యెను. ఎదుట నెత్తైన దేవాలయశిఖరము కానవచ్చెను. తత్సమీపమున నిటుకరాతితోఁ గట్టినప్రాకారము గల యిల్లొకటి కనఁబడెను. కపాలకుండలఁ బ్రాకారద్వారముచేరి యెడతెగకుండఁ దలుపు తట్టుటచే లోపలనుండి యెవరో "ఎవరు వారు? కపాలకుండలా!" అని ప్రశ్న చేసిరి. "తలుపు తీయుఁడు" అని యామెవచించెను.

లోపలనుండి తలుపు దెఱచిన యాపురుషుఁ డాదేవాలయమున కధికారి. అతని కేఁబదిసంవత్సరములు దాఁటినవి. పలుచని వెండ్రుకలుగల యాతనిశిరస్సును రెండుచేతులతో కపాలకుండల దగ్గఱకుఁ దీసికొని యాతని చెవి తన మోవికడకుఁ జేర్చికొని తన వెంట వచ్చినవానిస్థితి సంగ్రహముగా నాతనికి విశదపఱచెను. పూజారి చాలసేపు తల చేతులపై వాల్చుకొని యేమో యాలోచించి తుద కిట్లనెను: "చాల చిక్కు వచ్చినది! ఆ మహాపురుషుఁడు సంకల్పించిన యెడల నెంతయైనఁ జేయఁగలఁడు. ఏదెట్లైనను దేవి యనుగ్రహమున నీకమంగళము కలుగదు, అతఁడెవఁడు?"

"రమ్ము" అని కపాలకుండల నవకుమారుని బిలిచెను. ప్రాంగణమున నిలిచి యున్న యాతఁడు పిలువగానే యింటిలోనికి వచ్చెను. పూజారి యతనితో "నేడు నీవిచట నేదాగియుం

డుము. జే పుదయము నిన్ను మేదినీపురమార్గము విడిచి వచ్చెదను.'' అని చెప్పెను.

మాటపై మాటమీఁద నింతవరకునునవకుమారుఁడు భోజనము చేయలేదని యర్చకునకుఁ దెలిసినది. కావున నతఁడు నవకుమారున కాహారము సమకూర్ప నారంభించెను. నవకుమారుఁ డాహారము నెంతమాత్రము స్వీకరింప నిష్టపడక కేవలము విశ్రమస్థానమునకై వేఁడుకొనెను. పూజారి తన వంటయింట నవకుమారునకు శయ్య నేర్పాటు చేసెను. నవకుమారుఁడు పరుండినతరువాత కపాలకుండల సముద్రతీరమునకు మరలిపోవ నుద్యమించెను. పూజారి యామెను సస్నేహదృష్టితో విలోకించి,"పోవలదు, క్షణ మాఁగుము నా కొక కోరిక కల''దనెను.

"ఏ మది?"

''నిన్నుఁ జూచినది మొదలు 'అమ్మా'యని పిలువ బుద్ధి పొడముచున్నది. మహాదేవి పాదము లాన! మాతల్లికన్న నీమీఁద నా కెక్కువప్రేమ కలుగుచున్నది. నాప్రార్థనము త్రోసిపుచ్చవలదు!"

"త్రోసిపుచ్చను."

"నీ వచ్చుటికి మరలి పోవల దనియే నా ప్రార్థనము!"

"ఎందుచేత?"

''పోయినచో నీ కిఁక శరణ ముండదు.''

"నా కది తెలియును.''

"అట్లయిన నెందుల కడిగితివి?"

"ఆచటికిఁ గాక యింకెచటికిఁ బోఁగలను?"

"ఈ పాంథునివెంట దేశాంతరమునకుఁ బొమ్ము."

కపాలకుండల నిశ్శబ్దముగా నుండ, అమ్మా! యేమాలోచించుచున్నావు?" అని పూజారి యామె నడిగెను.

"ఈ శిష్యురాలు మీదగ్గఱకు వచ్చినపుడే యువతి యిట్టి యువకుని వెంటఁ జనుట యుక్తముకాదని చెప్పియుంటిరి కదా! ఇపుడు పొమ్మని చెప్పుచుంటి రేల?"

"అప్పుడు నీజీవితవిషయమై సంశయము లేదు. విశేషించి యొకప్పు డాలోచింపని యవసర మిప్పుడు కలుగ వచ్చును గదా! రమ్ము, మహాశక్తి యనుమతి గైకొందువు గాని."

అంతఁ బూజారి దీపము చేతఁ బట్టుకొని దేవాలయ ద్వారము చేరి తలుపులు తెఱచెను. కపాలకుండలయు నాతని వెంటఁ జనెను. ఆలయములో మానవాకారపరిమాణముగల కరాలకాలికా మూర్తి ప్రతిష్ఠితమై యుండెను. ఇరువురును భక్తిభావముతోఁ బ్రణామ మొనరించిరి. అర్చకుఁ డాచమనము చేసి పుష్పపాత్రమునుండి మారేడుదళమును గ్రహించి దానిని మంత్రపూతముచేసి దేవీపాదములం దునిచి దాని వంకఁ జూచుచుండెను. క్షణము తరువాతఁ బూజారి కపాలకుండలతో నిట్లనెను: "అమ్మా! చూడుము! మహాదేవి నీ యర్ఘ్యము గ్రహించినది. బిల్వదళము పడిపోలేదు. నీకు శుభమగును. నీ వీపథికుని వెంట స్వచ్ఛందముగ నరుగవచ్చును విష

యలోలురసంగతి నాకుఁ దెలియును. కేవలము విషయలాల సవై నీ వీతని వెంటఁ జనినయెడల ముక్క మొగ మెఱుఁగని పడుచుదానిని దీసికొనివచ్చినాఁ డని లోకు లీతని నీచముగాఁ జూచెదరు. నిన్నును నిందించెదరు. ఇతఁడు బ్రాహ్మణుఁ డని చెప్పితివి. మెడలో జందెము కనఁబడుచున్నది. నిన్నితఁడు వివాహమాడి తీసికొని పోయెనేని సమస్త విధముల శుభము చేకూరును. అట్లు కాకున్న నేనుఁగూడ నీతని వెంటఁబొమ్మని చెప్పియుండను."

"వివాహమా!" అనుమాట మెల్లమెల్లగా నుచ్చరించి పిమ్మట నామె "వివాహ మనుమాట మీనోట వింటిని. కాని యెవరివిషయమై చెప్పితిరో సరిగాఁ దెలియలేదు. వివాహ మన నేమి చేయవలయును." అని వచించెను.

పూజారి మందహాసము చేసి "ఆడుదానికి వివాహ మనునది ధర్మాచరణమునకు ముఖ్యసోపానము. ఇందుచేత నే స్త్రీని సహధర్మిణి యందురు. జగన్మాతయు శివుని వివాహమాడినది" అని పలికెను.

సమస్తము తెలియఁ జెప్పితి నని పూజారి యనుకొనెను. సకలము తెలిసికొంటి నని కపాలకుండలయు ననుకొనెను. "అట్లే కానిండు. కాని నాయనగారిని విడిచి పోవుటకు నా మన సొప్పుట లేదు. ఇంతకాలము నన్నాయన పోషించినారు" అని కపాలకుండల పలికెను.

"దేనికిఁ బోషించుచున్నాఁడో నీకుఁ దెలియదు!" అని

పూజారి తాంత్రికసాధనమునకును దరుణులకును గల సంబంధమును వ్యంగ్యముగా నామెకుఁ దెలియఁజేయయత్నించెను. కపాలకుండల కేమియుఁ దెలియలేదు. కాని యామె చాల భయపడి 'వివాహమే కానిం" డనెను.

తరువాత వారిరువురు నాలయమునుండి బయటికి వచ్చిరి. కపాలకుండల నొకగదిలో నుంచి పూజారి నవకుమారుఁడు పరున్నచోటికిఁ బోయి యతని శిరముచెంతఁగూర్చుండి "మహాశయా! నిద్రపోవుచున్నారా?" అని యడిగెను.

నవకుమారుఁడు నిద్రించుస్థితిలో లేఁడు; తన యవస్థను గూర్చి విచారించుచుండెను. పూజారిప్రశ్నము విని "చిత్తము నిద్రపోవుట లే"దని పలికెను.

"బాబా. మీవిషయము తెలిసికొన వచ్చితిని. మీరు బ్రాహ్మణులా?"

"చిత్తము"

"ఏశాఖ"

"రాఢీయశాఖ."

"నేనును రాఢీయబ్రాహ్మణుడనే, ఉత్కలదేశ బ్రాహ్మణుఁడ నని తలఁపవలదు. మా శాఖవారు కులగురువులు. ఇప్పుడు మహాశక్తి చరణములు సేవించుచున్నాను. మీనామధేయము?"

"నవకుమార శర్మ."

"నివాసము?"

„సప్తగ్రామము."

„ఏపేట?"

"వంద్యఘట్టము."

„మీకు భార్య లెందఱు?"

„ఒక్కతె."

నవకుమారుఁడు తన వృత్తాంతము విప్పి చెప్పలేదు ప్రకృత మతని కొక్క భార్యకూడ లేదు. రామగోవింద ఘోషాలుని కూఁతు రగుపద్మావతి నాతఁడు వివాహమాడియుండెను. వివాహానంతరము పద్మావతి కొలఁదిదినములు పుట్టినింటనుండి యప్పు డప్పు డత్త వారింటికి వచ్చుచుఁబోవుచుండెను. ఆమెకుఁ బదునాలుగు వత్సరముల వయస్సున నామెతండ్రి సకుటుంబ ముగఁబురుషోత్తమక్షేత్రమునకుఁ బోవుచుండెను. ఆకాలమున అక్బరుపాదుషాహ యాజ్ఞానుసారముగా పఠానులు దూరీభూతులై ఉత్కలదేశమున గుంపులుగుంపులుగా నివసించుచుండిరి. వారి నణఁచుట కక్బరుపాహ సాధ్యమైనన్ని యత్నములు చేయుచుండెను. రామగోవిందఘోషా లుత్కలదేశమునుండి తిరిగి వచ్చుసమయమున మొగలులకు పఠానులకు యుద్ధము ప్రారంభ మయ్యెను. మార్గములో నతఁడు పఠానులకుఁ జిక్కెను. ఆకాలమున పఠానులు యుక్తాయుక్త వివేచనము లేనివారు. వా రనపరాధులగు బాటసారులపైఁబడి ధనాదులు దోచుకొని పోవుచుండిరి. రామగోవిందుఁడించుక కోపస్వభావము కలవాఁడు. పరుషముగా మాటలాడుటచే వారాతని

కుటుంబము నడ్డగించిరి. చివరకు రామగోవిందుఁడు స్వధర్మ మును బరిత్యజించి సకుటుంబముగా ముసల్మానుమతము నవ లంబించుట కంగీకరించుటచే నిష్కృతి నొందఁగలిగెను.

రామగోవింద ఘోషాలు సకుటుంబముగాఁ బ్రాణములతో నిల్లుచేరెను. కాని మహమ్మదీయమతము నవలంబించుటచే స్వజను లొక్కసారిగా నాతనిని బరిత్యజించిరి. ఆసమయమున నవకుమారుని తండ్రియు నచట నుండుట తటస్థించెను. జాతి భ్రష్టుని కొమార్తెనుగూడ జాతిభ్రష్టఁగాఁ దలఁచి యతఁడు వదలి పెట్ట వలసివచ్చెను. అటుతరువాత నవకుమారుఁడు తన భార్య నెన్నడును జూడలేదు.

స్వజనత్యక్తుఁడు ధర్మచ్యుతుఁడు నగు రామగోవిందఘో షాలు విశేషకాలము స్వదేశమునం దుండలేకపోయెను. ఇంతే కాక రాజానుగ్రహము పొందియున్నతోద్యోగము సంపాదింప వలయునను కాంక్ష చేనతఁడు రాజధాని యగురాజమహాలుకుఁ బోయి నివసించుచుండెను. మతాంతరుఁడగుటచే నతఁడు సకు టుంబముగ మహమ్మదీయనామములు ధరించెను. రాజమహా లుకుఁ బోయినతరువాత మామయు భార్యయు నెట్లున్నారో నవకుమారునకుఁ దెలియ వీలులేకపోయెను. ఇంతవఱకును నతని కేమియుఁ దెలియదు. తరువాత విరక్తిచే నవకుమా రుఁడు మరల వివాహమాడలేదు. అందుచే నతని కిప్పుడొక్క భార్యయు లేదు.

పూజారి కీవృత్తాంతమంతయుఁ దెలియదు. సద్వంశజున కిరు

పురుభార్యలున్నను నేమిప్రమాదమని యాతఁడనుకొని ప్రకా
శముగా నిట్లనెను: “మిమ్మొక ప్రశ్న మడుగవలయునని
వచ్చితిని. ఈకన్య మీప్రాణములు రక్షించినది. పరహితా
ర్థము తనజీవితము కోలుపోయినది. ఈమెను బోషించుచున్న
పురుషుఁడు మిక్కిలి భయంకర స్వభావుఁడు. ఆయనకడ కీమె
తిరిగిపోయెనేని మీకెట్టిగతి పట్టినదో యీమెకును నట్టి
గతియే పట్టఁగలదు. ఇందుల కేదైన నుపాయమాలోచింపఁ
గలరా?”

నవకుమారుఁడు లేచి కూర్చుండి యిట్లనెను.: ,,నేను నట్లే
భయపడుచున్నాను! తమ కంతయుఁ దెలియును. ఇందుల కుపా
యము చెప్పుడు. ఆమెకుఁ బ్రత్యుపకార మొనర్చుటకై
నాప్రాణములుసైత మర్పింప సిద్ధముగా నున్నాను. తిరుగ నా
నరఘాతకుని యొద్దకుఁ బోయి యాత్మసమర్పణము చేయు
దునాయని యనుకొనుచున్నాను. అట్లయిన నీమెప్రాణములు
దక్కును.''

పూజారి నవ్వి యిట్లనెను: ,,మీరు పిచ్చివారు! దీనివలనఁ
బ్రయోజన మేముండును? మీరు ప్రాణములు కోల్పోవుట యే
తటస్థించును గాని యీమెపై నా మహాపురుషుని కోపము
శమింపదు. దీని కొక్కయుపాయ మున్నది.''

,,అదేమి?''

,,మీరీమెను వెంటఁ గొనిపోవుటయే. కాని యిది దుర్ఘ
టము. మీ రిక్కడ నుండినచో నొకటి రెండు దినములలోఁ

బట్టుపడుదురు. ఆమహాపురుషుఁ డీదేవాలయమునకు వచ్చుచుఁ బోవుచుండును. కావున కపాలకుండల కశుభమే కనబడుచున్నది."

నవకుమారుఁ డాతురముగా "నావెంట వచ్చుట దుర్ఘట మెట్లగును?" అని యడిగెను.

"ఈమె యెవరిపుత్రికయో, ఏకులమున జన్మించినదో, యెవరిభార్యయో మీకించుకయుఁ దెలియదు. మీరీమెను వెంటఁ గొనిపోవుదురా? వెంటఁ గొనిపోయినను నీమెను మీయింట నుండ నిచ్చెదరా? కానిచో నీదిక్కులేని దెచటికిఁ బోవును!"

నవకుమారుఁ డొకించుక యాలోచించి "నాప్రాణములు రక్షించిన యామెకై నాకేకార్యము నసాధ్యము కాదు. ఈమె నాకుటుంబములోనిది కాగలద నెను."

"మంచిది. కాని యీామె యెవరని మీవార లడిగిన నేమి సమాధానము చెప్పెదరు?"

నవకుమారుఁడు మరల నించుకతడ వాలోచించి, "మీరే యీామె వృత్తాంతము తెలియఁ జేయుఁడు. నేను మావారికిఁ జెప్పెదను" అని పలికెను.

"మంచిది. కాని పదూరాంతరమున యువతీయువకు లనన్య సహాయులై మార్గమున నెట్లు పోఁగలరు? విన్నను జూచినను లోకులేమందురు? మీరు బంధువులకడ నేమని చెప్పగలరు? ఇక నేనో యీామెను నాతల్లిగా భావించుచున్నాను. నేను

మాత్ర మీ మెకెట్లపరిచితుఁడగు యువకుని వెంట నొంట రిగా దూరదేశమునకుఁ బంపఁగలను?”

పురోహితపుంగవుఁడు సంబంధములు కుదుర్చుటలోఁ దెలివి తక్కువవాఁడు కాఁడు.

“మీరు మా వెంట దయచేయుఁడు” అని నవకుమారుఁ డనెను. “నేను మీ వెంటవచ్చుటయా? ఇచ్చట భవానీపూజ యెవరు చేయుదురు?”

నవకుమారుఁడు సంచలిత మనస్కుఁడై “అట్లయిన నీక నుపాయ మేమియు లేనే లేదా?” యనెను.

“ఉపాయ మొక్కటియే యున్నది. అది మీయౌదార్యము ననుసరించి యుండును.”

“అ దేమి? నేను దేనికి నడ్డు చెప్ప లేదే, ఆయుపాయ మేదియో సెలవిండు.”

“ఈమె బ్రాహ్మణకన్య. ఈమె వృత్తాంత మంతయు నే నెఱుఁగుదును. బాల్యమునం దీమె దుర్మార్గులగు క్రైస్తవతస్కరులచే నపహృత యయ్యెను. మార్గమున విఘ్నములు కలుగుటచే మఱునా డీమెను వారు సముద్రతీరమున విడిచిపోయిరి. ఈ వృత్తాంతము నామెవలన మీరు సవిశేషముగాఁ దరువాతఁ దెలిసికొనఁగలరు. కాపాలికుఁ డీమెను గనుఁగొని తనయోగ సిద్ధికై యుపయోగించుకొనునుద్దేశముతో నప్పటినుండి పోషించుచున్నాఁడు. అచిరకాలములో నతఁడు తనప్రయోజనము నెఱవేర్చుకొనును. ఈమెకింతవఱకుఁ బెండ్లి కాలేదు.

ఈమె చరిత్రము పరమపవిత్ర మైనది. ఈమెను మీరు వివాహమాడి మీగృహమునకుఁ గొనిపొండు. ఎవ్వరు నేమియు ననఁజాలరు. నేను యథాశాస్త్రముగ మీకిరువు రకు బెండ్లి చేసెదను.”

నవకుమారుఁడు శయ్యనుండి లేచి యిటునటుఁ దిరుగసా గెను. అతఁడు మాఱు పలుకలేదు. కొంతసే పైనతరువాతఁ బూజారి యిట్లనెను: “మీ రిఁక నిద్రపొండు. తెల్లవాఱుజా మున మిమ్ము మేల్కొల్పెదను. ఇష్టము లేదేని మీ రొక్కరే పోవచ్చును. మీకు మేదినీపురముత్రోవ చూపి వచ్చెదను.”

పూజారి వెడలిపోయెను. పోవునపు డతఁడు ‘‘రాఢదేశము లెప్పుడును సంబంధములు కుదుర్చు నేర్పు మఱవఁగలరా?’’ అని యనుకొనెను.

౬

మఱునాఁటియుదయమునఁ బూజారినవకుమారునికడకువచ్చి చూచి యతఁ డంతవఱకును నిద్రింపలేదని గ్రహించి ‘‘ఏమి నిశ్చయించుకొన్నా?’’ రని యతని నడిగెను.

‘‘నేఁటినుండి కపాలకుండల నా ధర్మపత్ని. ఈమెకై నేను సంసారము వదలవలసివచ్చినను వదలెదను. కన్యాదాన మెవరు చేయుదురు?” అని నవకుమారుఁ డనెను.

పురోహితపుంగవుని వదనము హర్షోత్ఫుల్ల మయ్యెను. నేఁటికి జగదంబకృపవలన మా కపాలకుండలకు విముక్తి కలి

గిన దనుకొని ప్రకాశముగా నేను కన్యాదానము చేసెదనని
తనశయ్యాగృహమునకుఁ బోయెను. అచట తాటియాకుల
పెట్టెలో జీర్ణతాళపత్రగ్రంథము కలదు. దానినిజూచి యతఁ
డు తిథివారనక్షత్రాదులను నిర్ణయించుచుండును. ముహూర్త
ము చక్కగా నాలోచించి యతఁ డిట్లనెను: "నేఁడు వివాహ
మునకు మంచిముహూర్తము లేదు. అయినను నీదినము దోష
రహితమైనది. సాయంలగ్నమునఁ గన్యను పాణిగ్రహణము
చేయించెదను. మీరు మాత్రము నేఁ డుపవాస ముండవల
యును. మీ కులాచారము ననుసరించి మిగిలిన శుభకార్యము
లన్నియు మీ యింటికిఁ బోయి సక్రమముగా నిర్వర్తించు
కొనుఁడు. ఇంకొక దినము మిమ్ములను దాచియుంచఁగలను.
ఇంకను నవకాశ మున్నది. నేఁ డాకాపాలిఁడు వచ్చినను
మీజాడ తెలియ నీయను. వివాహమైన తరువాత రేపటి
యుదయమున మీరు భార్యతో నింటికిఁ బోవచ్చును."

నవకుమారుఁ డిందుల కనుమతించెను. అప్పటికి వీలైనంత
వఱకు యథా శాస్త్రముగా సాయంలగ్నమందు నవకుమారు
నకును గాపాలిక రక్షితయు, ననన్యశరణ్యయు నగు కపాల
కుండలకును వివాహము జరిగెను.

కాపాలికునిజాడ తెలియలేదు. మఱునాఁ డుదయమున
మువ్వురును ప్రయాణసన్నాహము చేయసాగిరి. పూజారి
వారిని మేదినీపురమార్గమువరకుఁ బంపించి రావలయును.

ప్రయాణసమయమున కపాలకుండల మహాదేవికిఁ బ్రణామ

మొనర్పఁబోయి భక్తిభావముతోఁ బూలపుటిక నుండి బిల్వ దలమును దీసి దేవీపాదములపై నుంచి దానివంకఁ జూచుచు నిలుచుండెను. బిల్వదలము పడిపోయినది.

కపాలకుండల భక్తిపరాయణ. దేవీపాదములనుండి బిల్వ దలము పడిపోవుటఁ జూచి భయకంపితయై పూజారి కాసంగతి విన్నవించెను. పూజారియు విషణ్ణుఁడై యిట్లనెను: ''ఇక గత్యంతరము లేదు. ఇపుడు నీకు పత్యనుసరణమే ధర్మము. పతి శ్మశానమునకుఁ బోయినను నీవాతని వెంటఁ బోవలసినదే. కావున నిశ్శబ్దముగాఁ జనుము ''

అందఱును నిశ్శబ్దముగా బయలువెడలి చాలఁబొద్దెక్కునప్పటికి మేదినీపురమార్గము చేరిరి. అపుడు పూజారి సెలవు తీసికొనెదననెను. కపాలకుండల యేడువసాగెను. లోకములో, నామెకు బంధువని చెప్పతగినవాఁ డొక్కఁడుకూడ దూరమై పోవుచున్నాఁడు!

పూజారి యామెను బుజ్జగించుచు "అమ్మా, పరమేశ్వరి యనుగ్రహము వలన నీకు సంతానమునకు సంపదకుఁ గొదువయుండదు. దేశములో నాబాలగోపాల మీజగన్మాతను బూజ చేయుదురు. నీవును నీమహాశక్తిని బూజించుచుండుము. నీకొంగునఁ గట్టిన పైకముతో మేనా చేయింపుమని నీభర్తతోఁ జెప్పుము. నేను నీబిడ్డ ననుకొనుము '' అని కన్నీరు కార్చుచు వెడలిపోయెను. కపాలకుండలయుఁ గన్నీరు విడుచుచు బయలు వెడలెను.

# ద్వితీయ ఖండము

## ౧

నవకుమారుఁడు మేదినీపురమునకు వచ్చి పూజారి యిచ్చిన పైకముతో కపాలకుండల కొకదాసిని బోయీలను నేర్పాటు చేసి, యామెను మేనాలో నెక్కించి పైకముకొలఁదిగనుండుటచేఁ దాను కాలినడకను బయలుదేఱెను. వెనుకటిదినము శ్రమముచే నతఁడలసియుండెను. మధ్యాహ్నభోజన మైనతరువాత బోయీ లాతని జాల వెనుకబడవైచి ముందుబోయిరి. క్రమముగా సాయంకాలమయ్యెను. శీతకాలపుఁ బలుచని మబ్బు లాకాశము నావరించుచుండెను. సంధ్యాసమయము సయితము గడచిపోయెను. చీఁకటి వ్యాపించెను. సన్నచినుకులు పడసాగెను. నవకుమారుఁడు కపాలకుండల నెప్పుడు కలసికొందునా యని తహతహ లాడుచుండెను. మొదటిమజిలీలో నామెను గలసికొన వచ్చునని యతని నమ్మకము; మజిలీ వెంటనే కనిపించినదికాదు. రాత్రి సుమారు నాలుగైదు గడియల ప్రొద్దుపోయినది. నవకుమారుఁడు గబగబనడచుచుండఁ ద్రోవలోఁ దటాలున నాతని కాలికేదియో తగిలెను. కాలి తాఁకున నావస్తువు ఫెళఫెళమని బ్రద్దలయ్యెను. ఆతఁ డంతట నిలుచుండి మరల దానిని గాలితో నెట్టి చూచెను; మరల నది యట్లే ఫెళఫెళ మనెను. ఆ వస్తువును జేతికిఁ దీసికొన నది విరిగిపోయిన మేనాచెక్కవలె నతనికి దోచెను.

గగనమున జలదములు గ్రమ్మియున్నను నంత చీఁకటి లేదు. బయలున స్థూలవస్తువు లస్పష్టముగాఁ గనఁబడుచునే యుండెను. ఎదుట నేదియో పెద్దదిగా నతనికిఁ గానవచ్చెను. తాఁకి చూచి యది విరిగిపోయిన మేనా యని యతఁడు తెలిసికొని కపాలకుండల కేదో విపత్తు సంభవించినదని భయపడెను. మేనా చెంతకుబోవుచుండ వివిధ •వస్తువు లాతని కాలికిఁ దగిలినవి. అం దొకటి కోమలమైన మనుష్యశరీరము వలెఁ దోఁచుటచే నతఁడు కూర్చుండి దానిని జేతితో నిమిరి చూచెను. నిజముగా మనుష్యశరీరమే. శరీరము మిక్కిలి చల్లగ నుండెను. చెంత నేదియో ద్రవపదార్థ మతని చేతికిఁ దగిలెను. ఆవ్యక్తి చేయి పట్టిచూడ నాడులు కొట్టుకొనుచున్నట్లతనికిఁ గనఁబడలేదు. ప్రాణములు పోయినట్లుండెను. నిదానించి చూడ నుచ్ఛ్వాస నిఃశ్వాసములు వినవచ్చెను. ఊపిరి యున్నది కాని నాడి యాడుట లేదేమి? ఏమిది, యీవ్యక్తి రోగియా! అంత నతఁడు ముక్కుకడ వ్రేలుంచి చూచెను. ఊర్పులు వచ్చుటలేదు. కాని నిశ్వాసధ్వని యెక్కడిది? మఱియొక ప్రాణికూడ నిచట నుండి తీరవలయు ననుకొని “ఇచట బ్రాణములతో నున్నవా రెవరైనఁగలరా?” యని యతఁ డనెను. „ఉన్నారు” అని మృదుస్వరముతోఁ బ్రత్యుత్తరము వచ్చెను.

„నీ వెవరు?”

„నీ వెవరు?”

ఆ కంఠస్వరము స్త్రీస్వరమువలె నుండుటచే నతఁడాతుర

ముగా "కపాలకుండలా?" యని పిలిచెను.

"కపాలకుండల యెవరో నే నెఱుఁగను. నేను బాటసారిని. దొంగలచేతులలోఁ జిక్కి యిప్పుడు నిష్కుండల నైతిని !"

ఆ శ్లేషవాక్కు వినినంతనే నవకుమారుని హృదయ మించుక శాంతించెను. "ఏమి జరిగినది ?" అని యాతఁడామె నడిగెను.

"దొంగలు మా సవారి విరుగఁ గొట్టి మా బోయీలలో నొకనిఁ జంపి పోయినారు. వారు మాయొడలి నున్న నగలను దీసికొని మమ్ము బంధించి పోయినారు."

నవకుమారుఁడాచీకటిలో వెదకి చూడ నిశ్చయముగా నొకయువతి యా సవారిలో దృఢముగా బంధింపఁబడి యుండెను. వెంటనే యతఁ డామె కట్లువిప్పి "లేవగలవా"యనెను.

"నాకుగూడ లాఠీదెబ్బ గట్టిగాఁ దగిలినది. అందుచేఁ జాల బాధగా నున్నది. కొంచెము చేయి తో డిచ్చినఁ బట్టుకొని మెల్లగా లేవఁగల ననుకొందును."

నవకుమారుఁడు తనచేయి యందీయ నా యువతి యతని హస్తము పట్టుకొని లేచెను. అంత నతఁ డామెతో "నడువఁగలవా ?" యనెను.

ప్రశ్నమునకు సమాధానము చెప్పక యామె "తమ వెంట నెవ్వరో వచ్చుచున్నట్లున్న దే" యనెను.

"లేదు."

"సత్రి మెంతదూరమున నున్నది ?"

"ఎంతదూర మున్నదో చెప్పలేను. దగ్గఱనే యున్నదను కొనెదను."

"చీఁకటిలో నొక్కతను నీ మట్టిలోఁ గూర్చుండి యేమి చేయఁగలను: తమవెంట సత్రమువఱకు వచ్చెదను. ఎవరైన న న్నానుకొని వెంట వచ్చిన రాఁగలను."

"ఆపత్కాలమందు సంశయించుట మూర్ఖపుఁబని. నా భుజముపైఁ జేయివైచుకొని రమ్ము."

యువతి మూర్ఖముగాఁ బ్రవర్తింపక నవకుమారుని భుజముపై జేయి వైచుకొని బయలుదేఱెను.

నిజముగా సత్రము సమీపమందే యున్నది. సత్రము దగ్గఱనే యెల్లపుడు దొంగలు వెఱవక యిట్టి దుష్కార్యము లాచరించుచుండిరి. నవకుమారుఁ డాలస్యము కాకుండ నా యువతిని సత్రములోనికిఁ జేర్చెను.

అతఁడు సత్రములోనికిఁ బోయి చూడ కపాలకుండల కనిపించలేదు. దాసి యామె కొఱకయి ల్లేర్పాటుచేసెను. అతఁడంతఁ దనవెంట వచ్చినయువతి కొఱకయిల్లుమాటాడి యామె నందు విడియించెను. అతని యాజ్ఞానుసారముఁగ నింటియజమానురాలు దీపము గొనివచ్చెను. దీపకాంతిలో నతనికామె యసామాన్య సుందరి యని తెలిసినది. లావణ్యతరంగములలో నామె యౌవనశోభ శ్రావణనదివలెఁ బొంగి పొరలుచుండెను.

౨

ఆమె నిష్కళంక సౌందర్యవతి కాదనుటకుఁ గారణము లున్నవి. ఆమె శరీరపరిమాణము మధ్యమాకృతికన్నఁ గొంచెము దీర్ఘమగుట మొదటి కారణము. ఆమె యధరోష్ఠము కొంచెము క్రిందికి వాలియుండుట రెండవకారణము. ప్రకృత మామె శరీరచ్ఛాయ బంగారమువలె నుండకుండుట మూఁడవ కారణము.

ఆమెశరీర మించుక పొడవైనది. అయినను గరచరణాదులు వర్తులవలయి పరిపూర్ణ సౌష్ఠవమును బొంది యుండెను. వర్షాకాలమందలి వనలత విరివిగా నాకులు విడిచి మిలమిలలాడు చుండున ట్లామె యవయవస్ఫూర్తి మెఱుఁగు లీనుచుండెను. అందుచే నామెశరీర మించుక దీర్ఘమైనను యౌవనస్ఫూర్తిచే శోభావంతముగనే యుండెను.

ఎవరిని మనము సువర్ణచ్ఛాయలని చెప్పెదమో వారిలోఁ గొందఱు పండు వెన్నెలవంటి మేని కాంతి కలవారుఁ గొంద ఱుదయరాగమువంటి దేహచ్ఛాయ గలవారు నుందురు. ఆమె మేనిచాయ యీరెంటినిఁ బోలదు. కావున నామె పసిమి వర్ణము కల దని చెప్పలేము. కాని మనోహరత్వమం దామె తనుచ్ఛాయ యేమాత్రము తీసిపోదు. ఆమె శ్యామవర్ణ. కాని మనము కృష్ణుఁడు శ్యామసుందరుఁడనియు, కాళికశ్యామాంగి యనియుఁ జెప్పెదము. ఆమె యట్టి శ్యామవర్ణ కాదు. ఆమెది తప్తకాంచనమువంటి మెఱుఁగుచామనచాయ. నవో

దితపూర్ణచంద్రబింబము గాని హేమాంబుదకిరీటయగు నుషా దేవి గాని సువర్ణవర్ణల మేనిరంగులకు సరిపోలవచ్చును.

చాలమంది హేమాంగులను మెచ్చుకొనుచుందురు. కాని యిట్టి శ్యామవర్ణమును జూచి మోహితుఁ డగువానిని వర్ణ జ్ఞానశూన్యుఁడని చెప్పరాదు. చామనచాయను మెచ్చుకొనని వా రొక్కసారి లేమామిడిచిగుళ్ల విహరించు తుమ్మెదగుంపుల వలెఁ గాంతు లీనుచు శ్యామలవదనమున వ్రేలాడు నామె ముంగురులు మనస్సునకుఁ దెచ్చికొనుఁడు. సప్తమినాఁటి చందురునివంటి లలాటమందు ముంగురుల ముద్దుఁగొను నామె కనుబొమలు జ్ఞప్తికిఁ దెచ్చుకొనుఁడు. పండిన సహకారపర్ణ ములఁ బోలు నామె కపోలములను, వాని నడుమ నత్యంత రక్తిమగల యామె యధరోష్ఠమును జ్ఞప్తికిఁ దెచ్చికొనుఁడు. అప్పు డాయపరిచితరమణి సుందరులలో సుందరి యని యను భూతము కాఁగలదు.

ఆమె కన్ను లతివిశాలములు కావు; అయిన నవి వక్రువలు పల్లవరేఖావిశిష్టములు, నత్యుజ్వలములు. ఆమెకటాక్షములు స్థిరములు, మర్మభేదకములు. ఆమెదృష్టిపైఁబడెనేని మనోగత రహస్యములనుగూడ భేదించుచున్నదనిపించును. చూచుచుండ మర్మభేదకములగు నామె దృష్టులు భావాంతరము నొందు చుండును. నయనములు కోమలములై ప్రేమరసమున నోల లాడుచుండును. ఒక్కొక్కప్పు డామె కన్నులు మన్మథుని పడక టిండ్లవలె సుఖావేశజనిత మగునలసటను బ్రకటించుచుండును.

మఱియొకప్పు డవి మోహావిస్ఫారితములై మదనోద్వృత్తిచేఁ దళతళలాడుచుండును. ఇంకొకప్పు డామె లోలాపాంగములలో నీరదముల నడుమ విద్యుల్లతలవలెఁ గ్రౌర్యము విశద మగుచుండును.

ఆమెముఖకాంతిలో రెండువిషయము లనిర్వచనీయశోభావంతములు. మొదటిది సర్వమును భేదింపఁగల బుద్ధిప్రభావము; ఆత్మగరిమ రెండవది. అందుచే నామె తనమరాళగ్రీవము నించుక వంచి మోహనముగ నిలుచుండెనేని రమణీకుల రాజ్ఞివలెఁ జూపట్టక మానదు.

భాద్రపదమందలి నిండునదివలె నామె పదునేడేండ్లవయస్సున నున్నది. తన్నదీజలమువలె నామె లావణ్యము తలతలలాడుచుఁ బొంగిపొరలుచున్నది. మేనిమెఱుఁగుకన్నను గన్నుల నిగ్గుకన్నను నన్నిటికన్నను నామె సౌందర్యప్రభావము మఱింత సమ్మోహకరము. పూర్ణయౌవనస్ఫూర్తిచే నామె తనువెల్ల నిరంతరము కొంచెము కొంచెముగఁ గదలుచుండెను. మారుతము లేనప్పుడించించుక కదలు శరన్నదివలె నామె దేహవల్లి చలించుచుండెను. మాటిమాటికి వెలికి వచ్చు నూత్నశోభయే యామె శరీరచలనమునకుఁ గారణము. నవకుమారుఁ డనిమేషనయనములతో నామె నూత్నశోభను దిలకించుచుండెను.

తెప్పవాల్పక యతఁడు విలోకించుచుండుటఁ జూచి యాసుందరి "ఏమి చూచుచున్నారు ? నా చక్కదనమునా ?" యనెను.

నవకుమారుఁడు సద్వంశజుఁడు. అతఁ డామె మాటలకప్రతిభుఁడై శిరము వంచుకొని నిరుత్తరుఁడై యుండెను. అంత నా రమణి మందహాసము చేసి "మీరు స్త్రీల నెప్పుడును జూడలేదా ? నే నందముగా లేను కాఁబోలు" అని పలికెను.

సామాన్యముగా నీమాటలు తిరస్కారసూచకములుగాఁ దోఁచును. కాని యామె చిఱునవ్వుతోఁ బలుకుటచే నందుఁ జమత్కారముతప్ప మఱేమియు నతనికి స్ఫురింపలేదు. ఇంత మధురమైన ప్రశ్నమున కెవరు ప్రత్యుత్తర మీయకుందురు? కావున నవకుమారుఁడు 'స్త్రీలను జూచితిని గాని నీవంటి సౌందర్యవతిని జూడలే' దనెను. ఆ రమణి దర్పముతో 'ఒక్కతెకూడ లేదో ?' యనునప్పటి కాతని హృదయమున కపాలకుండలా సౌందర్యము మెలఁగుచుండుటచే నతఁడును దర్పముతో 'ఒక్కతెకూడ లేదని చెప్పలే' ననెను.

'మంచిది. ఎవ రామె ? మీ యిల్లాలా ?"

"ఇల్లా లని యె ట్లనుకొంటివి ?''

"వంగదేశీయులు తమభార్యలంత చక్కనివా రెవ్వరుండ రనుకొందురు."

"నేను వంగదేశీయుఁడను, నీవును వంగాంగనవలె మాటలాడుచున్నావు. మీ దేశప్రాంతము ?''

ఆ యువతి తన దుస్తులపై దృష్టినిల్పి "ఈదురదృష్టురాలు వంగస్త్రీ కాదు. ముసల్మానీ'' యనెను. ఆమె దుస్తులవంకఁ జూడ నవకుమారున కామె నిజముగా ముస

ల్మానీవలెనే తోఁచెను. కాని యామె వంగీయులవలె స్వచ్ఛ
ముగా మాటాడుచున్నది.

"అయ్యా, చమత్కారముగా నావిషయముల సన్నిటిఁ
గ్రహించితిరి. మీసంగతులుకూడ నించుక తెలిపి చరితార్థ
రాలినిఁ జేయుఁడు. సాటిలేని యాయందగత్తె యలంకరించు
చున్న గృహ మేచ్చట నున్నది?"

"మా నివాసము సప్తగ్రామము."

ముసల్మానీ మాఱువలుకక వెంటనే తలవంచుకొని దీప
మెగసనఁ ద్రోసెను. కొంచెముసే పైనతరువాత మొగము
పైకెత్తకయే 'ఈదాసిపేరు మోతీబీబీ. ఆర్యులనామధేయము
వినవచ్చునా?" యనెను.

"నవకుమారశర్మ."

దీప మాఱిపోయినది.

3

నవకుమారుఁ డింటియజమానురాలిని బిలిచి దీపము దెమ్మ
నెను. ఇంతలో నతనికి నిట్టూర్పు వినఁబడెను. దీపము వచ్చిన
తరువాత ముసల్మానుసేవకుఁ డొకఁడు డచ్చుటకి వచ్చెను.
"ఇదేమి, మీ రింత యాలస్యము చేసినా రేల ? మిగిలినవా
రెచట నున్నారు?" అని ముసల్మాని ప్రశ్నించెను.

‘బోయీ లందఱు త్రాగి పడిపోయిరి. వారల నందఱ నొక్క చోఁ జేర్చి సవారి మోయించుకొని వచ్చుటలో వెనుక బడిపోతిమి. తరువాతఁ ద్రోవలో విరిగిపోయిన మేనా చూచి యందు మీరు లేకుండుటచే మా కేమియుఁ దోఁచలేదు. కొంద ఱచటనే యుండిరి; కొందఱు వెదకుటకై యాయా దిక్కులకుఁ బోయిరి; నే నిటు వచ్చితిని.”

“వారల నందఱను దీసికొని రమ్ము.”

నౌకరు సలాము చేసి వెడలిపోయెను. ఆ యవని యించుక సేపు కరకలితకపోల యై కూర్చుండెను.

నవకుమారుఁడు వెళ్లెద ననెను. మోతీ నిదుర మేల్కాంచిన దానివలె లేచి నిలుచుండి పూర్వమువలె “మీ రెచట బస చేసినారు?” అని యడిగెను.

“ఇచటనే. ఆవలియింటిలో.”

“మీ రున్నయింటిలో మేనా కనఁబడినది. అందు మీ వెంట వచ్చిన దెవరు?”

‘నా భార్య.’

మోతీ మరలఁ జమత్కారముగా మాటలాడుట కవకాశము గలుగఁ జేసికొని “ఆమె యేనా యసామాన్యసుందరి!” అనెను.

“చూచినఁ దెలియఁగలదు.”

“చూచుటకు వీ లుండునా!”

ఇంచుకసేపు విచారించి, యతఁడు "అభ్యంతర మేముం డును ?" అనెను.

"అయిన నొక్క ప్రార్థనము. ఆ యసామాన్య సుందరినిఁ జూచుటకు నాకుఁ జాలఁ గుతూహలముగా నున్నది. ముందుగాఁ బోయి, యామెతోఁ జెప్పఁ గోరుచున్నాను. కాని యిప్పుడు కాదు. మీరు దయచేయుఁడు. తరువాతఁ గబురంపెదను."

నవకుమారుఁడు వెడలిపోయెను. కొంతసేపైన తరువాతఁ జాలమంది పరివారజనులును బోయీలును పెట్టెను బట్టించుకొని వచ్చిరి. వారి వెంట మేనాయు నం దొక దాసియు వచ్చిరి. తరువాత నవకుమారునకు మోతీబీబీగారు జ్ఞాపకము చేయుమన్నా రని కబురు వచ్చెను. అతఁడు మరల మోతీకడకు వచ్చి చూడ నామె పూర్వపు దుస్తులను వదలి సువర్ణముక్తా శోభితములును శిల్పవిరాజితములు నగు వేషభూషలు ధరించి యుండెను. నిరలంకృతమగు నామె దేహ మిపు డలంకారభూషిత మయ్యెను. కుంతలములందును గబరియందును లలాటమునందును నయనపార్శ్వములందును గంఠమందును గర్ణములందును వక్షముమీఁదను బాహుయుగ్మమునందును సువర్ణ ఖచిత వజ్రాభరణములు తలతలలాడుచుండెను. నవకుమారుని నేత్రములు మిఱుమిట్లుగొనెను. నవోదితనక్షత్రమాలావృత మగు నీలాంబరమువలె మనోహరమగు నామెయున్నత శరీర మలంకార బాహుళ్యముచే నొప్పు లొలుకుట యేకాక యామెసౌందర్యము మఱింత కాంతిమంత మయ్యెను. "మహా

శయా దయచేయుఁడు. మీా భార్యను జూచివత్తము” అని మోతీబీబీ పలికెను.

“చూచివచ్చుట కింత యలంకార మవసరము లేదు. నా భార్యకు సొమ్ము లేవియు లేవు.”

“సొమ్ములు లేకపోవచ్చును. ఆమెకుఁ జూపించుటకై నే నలంకరించుకొన్నాను. స్త్రీలకు సొమ్ము లుండెనేని యవి యితరులకుఁ జూపింపనిదే వారి కేమియుఁ దోఁచదు. ఇఁకఁ బోవుదము.”

నవకుమారుఁడు మోతీబీబీని వెంటఁ గొనిపోయెను. ఇంతకుఁ బూర్వము మేనాలో వచ్చిన దాసియు వారివెంటఁ జనెను. ఆమెపేరు పేష్మన్.

కపాలకుండల యద్దెయింటఁ జెమ్మనేలపై నొంటరిగఁ గూర్చుండియుండెను. దీపము సన్నగా వెలుఁగుచుండెను. చెదరియున్న కేశరాశి యామె వెనుక భాగము నంధకారముగఁ జేయుచున్నది. కపాలకుండలను జూచినంతనే మోతీబీబీకి నేత్రాంచలములందును నధరపార్శ్వములందునుమందహాసము జనించెను. చక్కగా విలోకించుటకై కపాలకుండల వదనము కడ కామె దీపమును గొనిపోయెను. అంత నామె వదనమున మందహాస మంతర్హితమై గంభీరభావము చూపట్టెను. మోతీ తెప్ప వాల్పక చూచుచుండెను. ఎవ్వరు మాటలాడలేదు. మోతీ ముగ్ధయయ్యెను. కపాలకుండల విస్మితయయ్యెను.

కొంతతడవునకు మోతీ తన యొడలిమీాఁది యాభరణ

ముల నూడఁదీసి యొక్కొక్కటిగా కపాలకుండలకుఁదొడుగ నారంభించెను. కపాలకుండల యేమియుఁ బలుకలేదు. నవకుమారుఁడు, "అ దేమిపని!" యనెను. మోతీ బదులు చెప్పలేదు.

అలంకరణము పూర్తి కాఁగానే మోతీ నవకుమారునితో నిట్లనెను. "మీరు నిజమే చెప్పినారు. ఇట్టిపుష్పము రాజోద్యానములందుఁ గూడఁ బుష్పింపదు. ఈ సౌందర్యరాశిని రాజధానియందుఁ జూపలేక పోతి నని చింతిల్లుచున్నాను. ఈ యలంకారము లన్నియు నీమె మేనిమీఁదనే యుండఁదగినవి. ఈ పరదేశినిని జ్ఞప్తి యుంచుకొనుఁడు!"

నవకుమారుఁ డులికిపడి "ఇదేమి? ఇవి యమూల్యాలంకారములు! వీనిని నే నేల పరిగ్రహింపవలయు?" ననెను.

"ఈశ్వరానుగ్రహమువలన నా కింకను నాభరణము లున్నవి. ఈ నగ లీమెకుఁ బెట్టుటచే నాకు సంతోషము కలుగుచుండ మీ రేల యడ్డగించెదరు?" అని మోతీ దాసితో వెడలిపోయెను. బయటికి వచ్చిన తరువాత పేష్మన్ బీబీజాన్! ఈమె యెవరు?" అని యడిగెను.

"నా సవతి" యని యవనయువతి బదులు పలికెను.

## ౪

అలంకారములగతి. మోతీబీబీ భూషణములు దాఁచుకొను టకై దంతపుఁబెట్టె నొకదానిని బంపించెను. దొంగ లామె కడనున్న కొలఁది వస్తువులు మాత్రమే దొంగిలించిరి. అనఁగా నప్పటి కామెకడ నున్నది తప్ప మఱేమియుఁ బోలేదు.

నవకుమారుఁడు కపాలకుండలకు రెండుమూఁడు నగలు మాత్రి ముండనిచ్చి మిగిలినవి దంతపుఁబెట్టెలో దాఁచెను. మఱునాఁటి యుదయమున మోతీబీబీ వర్ధమానమునకును, నవకుమారుఁడు భార్యతో సప్తగ్రామమునకును బయలుదేఱి పోయిరి. అతఁడు కపాలకుండలను మేనాలో నెక్కించి దంత పుఁబెట్టె నామె కడ నుంచెను. బోయీలు సులువుగా నాత నిని వెనుకవైచి ముందుపోయిరి. కపాలకుండల మేనా తలు పులు తెఱచి యటునిటుఁ జూచుచుండెను. భిక్షుకుఁ డొకఁడు బిచ్చ మడుగుచు నామె వెంటఁ బోవసాగెను.

„నా కడ నేమున్నది ? నీ కే మీయఁగలను?'' అని కపాల కుండల వానితో ననెను.

భిక్షుకుఁ డామె మెడలో నున్న నగలవంకఁ జూపుచు „అవేమి తల్లీ మీ మెడలో ముత్యములు రత్నములు కనఁబడు చుండ నేమియు లే వనెద వేల ?'' అనెను.

„నగ లిచ్చిన నీకుఁ దృప్తి కలుగునా ?"

భిక్షుకుఁ డించుక యాశ్చర్యపడెను. అతని యాశకు మేర లేదు. తరువాత నతఁడు „కలుగ కేమి, తల్లీ!'' యనెను.

కపాలకుండల నిష్కపటహృదయముతో దంతపుఁబెట్టెలో నున్న నగలతోపాటు మెడలోని సొమ్ములనుగూడ నిచ్చివేసెను.

భిక్షుకుఁడు క్షణకాల మాశ్చర్యవిహ్వలుఁడై యుండెను. దాసి మొదలగువారల కీసంగతి తెలియదు. బిచ్చగాని విహ్వలభావము క్షణమాత్రమే. తరువాత వాఁడటునిటుఁ జూచి నగలతో నూర్ధ్వశ్వాసమునఁ బాఱిపోయెను భిక్షుకుఁడు పరుగెత్తుచున్నాఁడేల యని కపాలకుండల యనుకొనెను.

౫

నవకుమారుఁడు కపాలకుండలతో స్వగ్రామము చేరెను- అతనికిఁ దండ్రిలేదు, తల్లియు నిరువురు చెల్లెండ్రును గలరు. పెద్దచెల్లెలు వితంతువు. రెండవ చెల్లెలు శ్యామసుందరి. ఈమె ముత్తైదువ యయ్యును గులీనపత్ని యగుటచే వితంతువువలె నుండెను. ఎచటనుండియో నవకుమారుఁడు కులగోత్రము లెఱుఁగని తాపసకన్యను వివాహమాడి యింటికిఁ గొనివచ్చినప్పు డాతని బంధువు లెంతవఱకు సంతోషింతురో చెప్పఁజాలము. ప్రస్తుత మతని కెట్టికష్టము కలుగలేదు. అందఱు నతఁడు తిరిగి రాఁడని నిరాశ చేసికొని యుండిరి. యాత్రికులు తిరిగి వచ్చి నవకుమారుఁడు పులినోటఁ బడెనని ప్రకటించిరి. ఈ సత్యసంధులు తమ తెలివితేటల ననుసరించి చెప్పియుండిరి, కాని వారు చెప్పిన దంగీకరింపనిచో వారికల్పనాశక్తి కవమానము

చేసినవారల మగుదుము. తిరిగి వచ్చిన యాత్రికులలోఁ జాల మంది నవకుమారుని వ్యాఘ్రము చంపుచుండఁ బ్రత్యక్షము గాఁ జూచితి మని నొక్కి వక్కాణించిరి. నడుమ నడుమ వ్యాఘ్రపరిమాణమునుగుఱించి తర్కవితర్కములుగూడ జరిగి నవి. కొందఱు పులి యెనిమిది మూరల పొడవనిరి. కొందఱు పదునాల్గుమూరల పొడుగుండవచ్చు ననిరి. మొదట చెప్పిన వృద్ధుఁడు ,,ఏది యెట్లయినను నేను మాత్రము తప్పించు కొంటిని. వ్యాఘ్రము మొదట నన్నుఁ గొట్టినది. నేను బాఱిపోతిని నవకుమారున కంత సాహసము లేకపోవుటచేఁ బాఱిపోలే దు.” అని చెప్పెను.

ఈవార్త నవకుమారుని తల్లి మొదలయిన వారికిఁ దెలి యఁగానే గ్రామములోఁ బెద్దయేడుపులు పెడబొబ్బలు బయ లు దేఱినవి. రెండుదినములవఱ కవి సమసి పోలేదు. ఏక పుత్రుని మరణవార్త వినినంతనే నవకుమారుని జనని మృత ప్రాయయయ్యెను. ఇట్టిసమయమున నవకుమారుఁడు భార్యతో నింటికి వచ్చెను. అప్పుడతనిని ,,నీభార్య యెవరి కుమార్తె?'' యని యెవరడుగుదురు? అందఱును సంతోషమున నోలలా డిరి. అతని తల్లి యత్యాదరముతోఁ గోడలి నింటిలోనికిఁ గొని పోయెను. కపాలకుండలను దనగృహజనము మిక్కిలి యాద రించుటచే నవకుమారున కానంద ముప్పొంగెను. ఇంటి లోనివా రాదరింప రను భయముతో కపాలకుండల లభిం చినను నించుక సంతోషమును గాని ప్రేమను గాని

యతఁడు వెలిఁబుచ్చలేదు. అంతేగాక యాతనిహృదయా కాశమున కపాలకుండలామూర్తి వ్యాపించియున్నను నిట్టిసంశ యముచేతనే పాణిగ్రహణప్రస్తావమునందుఁ గూడ నతఁడు చెప్పిన కపాలకుండలతో వివాహమునకు సమ్మతింపలేదు. షాంగిపొరల నున్న యనురాగసింధువునం దొకతరంగము నైన నతఁడు తొణకనీయలేదు. కాని యిప్పు డాసంశయము తీఱిపో యినది. అడ్డముగా నున్న పెద్దబండను దీసివైచినంతనే స్రోతో వేగ మెట్లు దుర్దమ మగునో యట్లే నవకుమారుని ప్రేమ తరంగిణి కూడ నంత వేగముగాఁ బ్రవహింపసాగెను.

అన్నప్పుడెల్ల నాతని ప్రేమావిర్భావము వ్యక్తమగుట లేదు కాని యతఁడు సజలనయనుఁడై యామెవంక తెప్పవాల్పక చూచునపుడును, బని లేకున్నను గల్పించుకొని యామెకడకుఁ బోవునప్పుడును, మాటలాడవలసినది లేకున్నను నామెను బలుకరించునపుడును, విషయము లేకున్నను నామెచే నేది యేని మాటలాడించునపుడును, దివారాత్రములు నామె సుఖ స్వాతంత్ర్యములకొఱకై ప్రయత్నించునపుడును, నన్యమన స్కుఁడై పచారు చేయునపుడును నాతని ప్రేమావిర్భావము ప్రకట మగుచుండెను. అతనిస్వభావము సైతము మాఱిపోఁ జొచ్చెను. చాపల్యమునకు మాఱుగా గాంభీర్యమును, నప్ర సాదతకు మాఱుగాఁ బ్రసాదతయు నాతనియందుఁ గానవచ్చు చుండెను. అతనివదన మెల్లపుడును బ్రఫుల్లముగ నుండెను. హృదయము ప్రేమ కాలవాలమగుటచే నితరులయెడఁ గూడ

స్నేహభావము వృద్ధియగుచుండెను. హేయభావము కలిగించువారియెడఁ దద్భావము క్షీణించిపోవుచుండెను. మనుష్యమాత్రులగువారెల్లరుఁ బ్రేమకుఁ బాత్రులగుచుండిరి. సత్కార్యముకొఱకే ప్రపంచము సృష్టమైన ట్లాతనికి స్ఫురింపఁ జొచ్చెను. ప్రణయ మిట్టిది! కర్కశమైనదానిని మృదువుగను దుర్మార్గుని సన్మార్గునిగను బాపాత్ముని బుణ్యాత్మునిగను నంధకారమును బ్రకాశముగను నది యొనర్చుచుండును.

ఇఁక కపాలకుండలో! ఆహా యేమి యామె సౌందర్యము!

## ౬

పూర్వకాలమున సప్తగ్రామ మహైశ్వర్యములతోఁ దులతూఁగుచుండెడి దని యందఱకుఁ దెలిసినవిషయమే. ఆకాలములో యవద్వీపము మొదలు రోమకపర్యంతము సకలదేశములం దుండువర్తకు లీమహానగరమునకువచ్చుచుండెడివారు. కాని వంగశకము పదిపదునొకండుశతాబ్దులందు సప్తగ్రామపు నైశ్వర్యము క్షీణింప నారంభించెను ఇందులకు ముఖ్యకారణమే మనఁగాఁ దన్నగరప్రాంతభాగమును దడుపుచు నే తరంగిణి ప్రవహించుచుండెనో యది యిప్పుడు సన్నబడిపోయినది. అందుచే గొప్పనావ లీనగరమువఱకు వచ్చెడి వీలుపోయినది. ఈకారణమున వాణిజ్యవృద్ధియుఁ గ్రమముగాఁ దగ్గిపోయినది. వర్తకగౌరవమునశించెనేని నగరైశ్వర్యముపోవును. సప్తగ్రామ

మైశ్వర్యము గోలుపోయినది. క్రీస్తుశకము పదునేడవశతాబ్ది యందు హుగ్లీ వాణిజ్యమున కనుకూలముగా నుండుటచే సప్త గ్రామమునకుఁ బ్రతిస్పర్థి యయ్యెను. కాని సప్తగ్రామమొక్క సారిగా సంపద కోల్పోవలేదు. ఫౌజుదారులు మొదలగు రాజపురుషు లంతవఱకును సప్తగ్రామమున నివసించుచునే యుండిరి. కాని నగరము సంపదఁ గోల్పోవుటచే వాస యోగ్యముకాక పల్లెవలె మాఱిపోయినది.

సప్తగ్రామములో నిర్జన మగు నగరోపకంఠమందు నవ కుమారునియిల్లు కలదు. ఇప్పుడు గ్రామము పాడుపడి యుం డుటచే నచట జనసమాగమముకూడ తగ్గిపోయినది. రాజ మార్గము పొదలతో నిండిపోయినది. నవకుమారుని యింటి వెనుక విశాలము నిబిడము నగునరణ్యము కలదు. ఇంటి కెదురుగాఁ గ్రోసెఁడుదూరములో నొక కాలువ ప్రవహించు చుండెను. ఆకాలువ కొంతవఱకు బయలును జుట్టివచ్చి నవ కుమారుని యింటివెనుక నున్న యరణ్యముగుండఁ బ్రవహించు చుండెను. గృహ మిటుకలతోఁ గట్టినది. దేశకాలములు విచారించి చూచిన దానిని సామాన్యగృహ మని చెప్ప వీలులేదు. రెండస్తుల మేడ యైనను నది యంత యెత్తైనది కాదు. ఒంటి యంతస్తులమేడలు దానికన్న నెత్తైనవి కలవు.

డాబాపై నెక్కి యువతు లిరువురు నల్వంకలఁ జూచుచు నిలుచుండిరి. సాయంకాల మగుచుండెను. నలుసైలుచాలదూ

మనోహరముగ నుండెను. సమీపమున దట్టమైన యరణ్యము కలదు. ఆ యడవిలో నసంఖ్యాకము లగు శకుంతములు కలరవము లొనర్చుచుండెను. రెండవవైపున గాలువ వెండితీగె వలె మెఱయుచుండెను. దూరమున నగరసౌధ శ్రేణులు శోభిల్లుచుండెను. ఆనగరము నవవసంతానిల స్పర్శాభిలాషు లగు నాగరకులతో నిండి విరాజిల్లుచుండెను. ఇంకొక వైపున జాలదూరమున నౌకాభరణ యగు భాగీరథి విశాలవక్షముపై సంధ్యాతిమిరము క్రమక్రమముగ వ్యాపించుచుండెను.

మేడపై నున్న యువతు లిరువురిలో నొకతె చంద్రికా వర్ణము కలది. విడియఁబోసికొన్న వెండ్రుకలతో నామె సగము మాత్రము కనఁబడు చుండెను. రెండవయువతి కృష్ణ వర్ణము కలది. ఆమెకుం బదునాలేండ్లు. ముఖము వికాస వంతము. శరీరము పలుచనిది. ఆమె పూర్వకాయముచుట్టును నొక్కులు తిరిగిన చిన్న చిన్న వెండ్రుకలు వ్రేలాడుచుండెను. నల్లకలువ ఱేకులు మధ్యభాగము నావరించి యున్నట్లు నేత్రములు విస్ఫారితములై కోమల ధవలవర్ణముతో బేడిసమీల వలెఁ బ్రకాశించుచుండెను. తన చిన్నవేళ్ళ నాఁడుబిడ్డ వెండ్రుకలలో దూర్చి యామె క్రీడించుచుండెను. చంద్రికా చ్ఛాయ గల యువతి కపాలకుండల. నల్లనిదగు నామె యాఁడు బిడ్డకు శ్యామసుందరి యని పేరిడితిమి.

శ్యామసుందరి తనయన్న భార్య నొకప్పుడు మాయింటి కోడలా యనియు, మఱియొకప్పుడు పరిహాసముగా నడవిపిల్లా

యనియు, నింకొకప్పుడు మృగా యనియుఁ బిలుచుచుండును. కపాలకుండల యనుపేరు వికటముగఁ దోఁచుటచే నింటి లోనివా రామెకు మృణ్మయి యని పేరు పెట్టుకొనిరి. శ్యామసుందరి చిన్నతనమున నభ్యసించిన యొకపాటపాడెను.

తమ్మి మొగ్గలు విచ్చుచున్నవి, తుమ్మెదలు విహరించుచున్నవి
తమ్మి రాణియు రేముసుం గిడి తనవిభుని గనవచ్చుచున్నది.
విపినలతో పర్ణముల విడి పాదపము కౌఁగిలిఁ జేరుచున్నది.
పొంగిపొరలి నదీజలమ్ములు పోవుచున్నవి జలధిఁ గలియఁగ
పండు వెన్నెల సోఁకి కల్వలపిండు సిగ్గును వీడి విరియగ,
క్రొత్త పెండిలికూఁతుఁ బూవులమెత్తనిడి చెలి పోవుచున్నది.
హా విధీ! ఈశ్యాల తాళను హర్షముననె విషాద మయ్యో!
సడలుచున్నది సిగ్గుముడి, హా యొడలు పరవశ మగుచునున్నది!

దరువాత శ్యామసుందరి యిట్లనెను: "నీవు తపస్విని వలెఁ గూర్చుంటివేమి ?"

"నే నేమి తపస్సు చేయుచుంటిని?"

శ్యామసుందరి తనచేతులతో నామె నొక్కులవెండ్రుకలు పట్టుకొని "నీవు వెండ్రుకలు ముడివేసికొనవా?" యనెను.

మృణ్మయి చిఱునగవుతో శ్యామసుందరిచేతినుండి తన శిరోజములు లాగికొనెను! "మంచిది, నాకోర్కెఁ దీర్పుము. ఒక్కసారి మాయింటి యాఁడుపడుచువలెఁ గనఁబడుము. ఎంతకాలము యోగినివలె నుందువు?" అని శ్యామసుందరి పలికెను.

"ఈ బ్రాహ్మణకుమారుఁడు కనఁబడ నంతవఱకు యోగి నిగా నుంటిని."

"ఇఁక నుండుటకు వీలు లేదు."

"ఎందుచేత?"

"ఎందుచేతనా! చెప్పవలయునా? యోగము చెడఁగొట్టెదను. స్పర్శమణి యని యెవరి నందురో తెలియునా?"

"తెలియదు."

"స్పర్శమణిచే నినుము బంగార మగును."

"అయిన నేమి?"

"ఆఁడువారికిఁగూడ స్పర్శమణి కలదు."

"అది యేది?"

"పురుషుఁడు! మగవానిగాలి తగిలినచో యోగినియు గృహిణియగును. ఆమణి నీకుఁ దాకించెదను. చూడుము?

చక్కగా నుండునో లేదో చానరో నే నపుడు తెలిపెద!
చిగురములు దువ్వి జడవైచెద చిక్కగాఁ బూవులను గ్రుచ్చెద
చెవుల దిద్దుల బెట్టి మోమున సిందూరపుఁ దిలక మునిచెద॥ చక్కగా॥
చందనము మెయినిండ నలది చంద్రహారము మెడను వైచి
చీరఁగట్టి మనోహరంబుగఁ జేతు నినుఁజక్కనౌ చుక్కగ॥ చక్కగా॥
ఎట్టినో నీమోవి మిక్కిలి యెఱ్ఱఁబడఁ దాంబూల మొసఁగెద
పసిఁడిబొమ్మనుబోలుబిడ్డనుబండుకొనఁ బెట్టెదను నీయొడి॥ చక్కగా॥

మృణ్మయి యిట్లనెను: "బాగుగాఁ దెలిసినది. స్పర్శమణిని దాఁకి బంగార మైతిని. వెండ్రుకలు ముడివైచుకొందును.. మంచి చీరెలు కట్టుకొందును. జడలోఁబూలు పెట్టుకొందును

కంఠమునఁ జంద్రహారము ధరించెదను. చెవులకు దుద్దులుపెట్టు కొందును. చందనము బూసికొని కుంకుమబొట్టు పెట్టుకొని తాంబూలము వేసికొని బంగారుబొమ్మ నయ్యెదను. అన్నియు జేయుదు ననుకొనుము. అందువలనఁ గలుగు సుఖమేమి!"

"పుష్పములు పుష్పించిన నేమి ఫలమో చెప్పుము!"

"లోకులు చూచి యానందించెదరు. పుష్పమున కేము న్నది?"

శ్యామసుందరి ముఖభావము గంభీర మయ్యెను. ప్రభాత వాతాహతములగు నీలోత్పలములవలె విస్ఫారితనేత్రము లించుక చలింప నామె "పుష్పమున కేమున్నదనియా? నేనాసంగతి చెప్పలేను. నేను బుష్పమునై పుట్టలేదు! కాని నేను నీవలె మొగ్గనైనచో వికసించి సుఖపడుదాననే!" యనెను.

మృణ్మయి నిశ్శబ్దముగా నుండుటఁ జూచి శ్యామసుందరి మరల నిట్లనెను: "సరే అట్లు కాకున్న నీ కేది సుఖమో చెప్పుము చూచెదను."

మృణ్మయి కొంచె మాలోచించి "చెప్పలేను. సముద్రతీరమందాయరణ్యములో నచ్చటచ్చట విహరించుచుండిన నాకు సుఖముగా నుండు ననుకొందు" నని పలికెను.

శ్యామసుందరి యించుక యాశ్చర్యపడెను. తనప్రయత్నమంతయు వ్యర్థ మగుగుచే నామెహృదయ మొకింత క్షోభించెను. ఇంచుక కోపముతో నామె "తిరుగ నచటికిఁబోవ నాలోచించుచున్నావా?" యనెను.

"ఆలోచనము లేదు."

"అయిన నేమి చేయుదువు?"

"యథా నియుక్తోస్మి తథా కరోమి" యని పూజారి చెప్పి నాఁడు."

శ్యామసుందరి ముఖము మఱుఁగు పఱచుకొని నవ్వి "చిత్రము, భట్టాచార్య మహాశయా! ఏమంటిరి?", అనెను.

మృణ్మయి నిట్టూర్పు విడిచి "విధాత యేది చేయించునో యది చేసెదను. లలాటలిఖిత మెట్లున్నదో యట్లు జరుగు" ననెను.

"లలాట మందేమిలిఖించి యున్నది? లలాటమున సుఖము వ్రాసి యున్నది. నీవు నిట్టూర్పు విడిచితి వేల?"

"అట్లయిన వినుము. నేను భర్తతో బయలుదేఱి వచ్చు నాఁడు భవానీపాదపద్మములపై బిల్వదళముంచితిని. జగదంబ పాదములపై బిల్వదళ ముంచనిది నే నేకార్యము చేయను. మనము తలఁచిన కార్యము సుఖప్రద మగునేని జగజ్జనని యా బిల్వదళము నుగ్రహించును. అమంగళము కలుగ నున్న యెడల బిల్వదళము క్రిందఁ బడిపోవును. ఎఱుఁగనివారితో నెఱుఁగని దేశమునకు రా సంశయించి శుభాశుభములు తెలిసికొన జగజ్జనని కడకుఁబోతిని. మా రేకుదళమును దేవి గ్రహింప లేదు. అందుచే లలాట లిఖిత మెట్లున్నదో తెలియ దంటిని!"

మృణ్మయి నిశ్శబ్దముగా నుండెను. శ్యామసుందరి యులికి పడెను.

## తృతీయఖండము

### ౧

నవకుమారుఁడు కపాలకుండలను దీసికొని సత్రమునుండి వెడలిపోవు నపుడు మోతీబీబీయును వేఱొకమార్గమున వర్ధమానమునకుఁ బోయెను. ఈమె చరిత్రము మహాదోషకలుషితము, మహాగుణశోభితము.

ఈమెతండ్రి మహమ్మదీయమతము నవలంబించినపు డీమె పేరు లుత్ఫున్నీసాగా మాఱిపోయెను. మొదటినుండియు నీమెకు మోతీబీబీ యనుపేరు లేదు. మాఱువేషముతో విదేశములందుఁ బ్రయాణము చేయునపు డెల్ల నీమె యీ పేరు పెట్టకొనుచుండెను. ఈమెతండ్రి ఢాకాకు వచ్చి రాజ్యకార్యములందు నియుక్తుఁ డయ్యెను. కాని యచటఁగూడ స్వదేశీయులతో నాయనకు సంపర్కము కలుగుచుండెడిది. సంఘచ్యుతులై స్వదేశీయుల నడుమ నందఱు నుండలేరు. అందుచే నతఁడు గొన్నిదినములలో సుబేదారుల యనుగ్రహము సంపాదించుకొని మిత్రు లగు నమ్మరాహుల సిఫారసుపత్రములు గ్రహించి సకుటుంబముగా ఆగ్రా వచ్చి చేరెను. అక్బరు పాదుషాకడ నెవరును దమగుణములు బయలుపడకుండ నుండలేరు. అక్బరుషాహ పరగుణగ్రహణపారీణు డగుటచే నతని గుణములు గ్రహించెను. లుత్ఫున్నీసాతండ్రి శీఘ్రకాలములో నున్నతోద్యోగమున నియుక్తుఁడై ఆగ్రాయందలి

యుమ్మ్రరాహులయందు మాననీయుఁడయ్యెను.

లుత్ఫున్నీసాకుఁ గ్రమముగ నీడు వచ్చుచుండెను. ఆగ్రాకు వచ్చి ఫారసీ సంస్కృతము నృత్యము గీతము రసవాదము మొదలగు విద్యలను చక్కఁగ నభ్యసించి రాజధానియందుఁ గల సౌందర్యవతులలోను గుణవతులలోను నగ్రగణ్య గాఁజొచ్చెను. దురదృష్టమువలన విద్యావ్యాసంగములో నామెకు మత సంబంధమైనవిద్య యేమియు రాలేదు. యౌవనము వచ్చినంతనే యామె మనోవృత్తు లనివార్యవేగము కల వయ్యెను. ఇంద్రియములను నిగ్రహింప నామెకుఁ బ్రయత్నముగాని కోర్కెగాని జనింపలేదు. మంచిచెడుగులం దామె సమానముగా ప్రవర్తించుచుండెను. ఈకార్యము మంచిది యీకార్యము చెడ్డది యని విచారించి యామె యేకార్యమునను బ్రవేశించుటలేదు. తన మనస్సునకు మంచిదనితోఁచినట్లు లామె చేయుచుండును. అసత్కార్యమం దామెయంతఃకరణమునకు సంతోషము కలుగునేని దానినే చేయును. యౌవనకాలమందు మనోవృత్తు లనివార్యము లైనపు డెట్టి దుష్కార్యము లందుఁబ్రవృత్తి కలుగునో యట్టి మనోవృత్తులామెకుజనించినవి.

ఆమెపూర్వభర్త బ్రతికి యుండగా నుమ్మ్రరాహు లెవరు నామెను బెండ్లియాడ నిష్టపడలేదు. ఆమెకును వివాహేచ్ఛ యంతగా లేదు. ప్రతికుసుమమందు విహరించు భ్రమరికిఁ బక్షచ్ఛేదన మేల చేయవలె నని యామె యనుకొనుచుండెను. మొదట గుసగుసలుగా బయలుదేఱి క్రమక్రమమున ఘోర

ముగా నామె యపకీర్తి నల్వంకల వ్యాపించెను. తండ్రి విర
క్తుఁడై యామె నింటినుండి వెడలఁగొట్టెను.

లుత్ఫున్నీసా రహస్యముగా స్నేహము చేయుచుండు వారి
లో యువరాజొకఁడు. ఇంకొక కులకలంకుఁ డుమ్మరావులలో
జన్మించియుండెను. తరువాత నతఁడు సహింపరాని తండ్రి
కోపానలమునకు గురి యయ్యెను. ఇట్టి యనుమానముతోడనే
సలీమామెను దనయవరోధ జనములోఁ జేర్చుకొనలేకపో
యెను. ఇపుడు మంచియవకాశము దొరకినది. రాజపుత్రప్రభు
వగు మానసింహుని చెల్లెలు యువరాజునకుఁ బ్రధానమహిషి
యయ్యెను. యువరాజు లుత్ఫున్నీసాను బ్రధానసహచారిణిఁ
జేసికొనెను. లుత్ఫున్నీసా ప్రత్యక్షమందు బేగమునకుఁ
జెలికత్తెయుఁ బరోక్షమందు యువరాజునకుఁ బ్రణయపాత్రము
నయ్యెను.

బుద్ధిమతి యగు లుత్ఫున్నీసా శీఘ్రకాలములో యువరాజు
హృదయము నెట్లు వశము చేసికొనెనో ఈ క్రింది విషయ
మువలన నించుక తెలియఁగలదు. సమయము చూచి తాను
రాణి కావలయు నను దృఢప్రతిజ్ఞ కలదై లుత్ఫున్నీసా యువ
రాజు హృదయమును నిరంకుశముగా వశము చేసికొనియుం
డెను. ఆమె స్థిరప్రతిజ్ఞ చేసికొని యుండుటయే కాక రాజాంతః
పురమందుండు వా రందఱు నట్లై తలఁచుచుండిరి. ఇట్టియాశా
స్వప్నమునకు వశమై జీవితమును గడపుచుండ నామెకు మెల
కువ వచ్చినది. అక్బరుషాహా కోశాధ్యక్షుఁడగు అక్తిమాదు

గ్లాలాఖాజా ఆయిస్ కూఁతురు మెహెరున్నీసా యవనయువతులలో నెల్ల సౌందర్యవతి. కోశాధ్యక్షుఁ డొకనాడు రాకుమారుఁ డగు సలీమును నింకగొందఱుముఖ్యులను దనయింటికి విందుకుఁ బిలచెను. ఆ దినమున సలీము మెహెరున్నీసాను జూచి మోహించి వెడలిపోయెను. తరువాత నేమి జరిగినదో యితిహాసము చదువుకొనినఁ దెలియఁగలదు. మహావిక్రమశాలి యగు షేరాఫ్గన్ అను నుమ్మరాహునకును గోశాధ్యక్షుని కొమార్తెకును బూర్వమే సంబంధ ముండెను. మోహాంధుఁడై సలీ మాసంబంధమును జెడగొట్టుటకుఁ దండ్రిని వేడుకొనెను. కాని తండ్రి కది యిష్టము లేకపోవుటచే నతఁడు తిరస్కృతుఁ డయ్యెను. అందుచే సలీము ప్రస్తుతము నిరాశుఁ డయినను గావచ్చును. అయినను నతఁడాశను సంపూర్ణముగా వదలిపెట్టలేదు.

షేరాఫ్గనునకును మెహరున్నీసాకును వివాహ మయ్యెను కాని సలీము చిత్తవృత్తులన్నియు లుత్ఫున్నీసానఖదర్పణము లందు బ్రతిఫలించుచుండుటచే నామె "షేరాఫ్గనునకు సహస్ర ప్రాణము లున్నను పరిత్రాణము లేదు. అక్బరుషాహా మరణానంతర మతఁడు ప్రాణములతో నుండఁడు. మెహెరున్నీసా సలీమునకుఁ బట్టమహిషి యగుట నిశ్చయము" అని యామె సింహాసనకాంక్ష వదలివేసెను.

మహమ్మదీయ సమ్రాట్టులలో శ్రేష్ఠుఁడగు అక్బరుషాహాకు మరణ మాసన్న మగుచుండెను. ఏ ప్రచండ మార్తాండుని

బ్రిభచే తుర్కీనుండి బ్రహ్మపుత్రానదివఱకు నుండుదేశమెల్ల ప్రదీప్త మయ్యెనో యామార్తాండుఁ డస్తంగతుఁడగుచుండెను ఆ సమయమున లుత్ఫున్నీసా తనకోర్కె నెఱవేర్చుకొనుటకై దుస్సాహసికమగు నాలోచనము చేసెను.

రాజపుత్రప్రభు వగు మానసింహుని చెల్లెలు సలీమునకు మహిషి. ఖుస్రూ యామె కుమారుఁడు. ఒకరోజున నామెకును లుత్ఫున్నీసాకును అక్బరుషాహావ్యాధివిషయమై సంభాషణము జరిగెను. రాజపుత్రస్త్రీ చక్రవర్తిని యగు నని లుత్ఫున్నీసా యామె నభినందించెను. అపుడు ఖుస్రూ తల్లి యిట్లనెను: "పాదుషాహాకుఁ బట్టపుదేవి నగుటచే జన్మము సార్థక మగునను మాట నిజమే. కాని పాదుషాహాజనని యగుట యత్యుత్తమము. ఈ ప్రత్యుత్తరము వినినంతనే యీవరకెన్నడు లేని యాలోచనము హృదయమున నుదయింప లుత్ఫున్నీసా 'అది మాత్రమేల కాఁగూడదు? అదియుఁ దమ యిచ్ఛాధీనమే" యనెను. "ఏ మది?" అని బేగ మామె నడిగెను. చతురయగు లుత్ఫున్నీసా "యువరాజకుమారుఁడగు ఖుస్రూకు సింహాసన మిప్పింపుఁ" డని పలికెను.

బేగ మేమియు మాటలాడ లేదు. ఆరోజున మరల నాప్రసంగము రాలేదు. కాని యీ యిరువురిలో నెవరును దానిని మఱవలేదు. భర్తకు మాఱు కుమారుని సింహాసనముపై నుంచుట బేగమున కభిమతము కాదు. మెహెరున్నీసాపై సలీమునకు గలయనురాగము లుత్ఫున్నీసాకెట్లు హృదయశల్యముగా

నుండెనో యట్లే బేగమునకు నుండెను. మానసింహుని చెల్లెలు తురుష్క యువతి యాజ్ఞానువర్తినిగా నుండుట కెట్లు సహించును ? లుత్ఫున్నీసాయు నిట్టి యభిప్రాయముతోడనే దృఢమనస్కయై యుండెను. మఱునాఁడీప్రసంగమువచ్చెను. ఇరువురును నిశ్చయించుకొనిరి.

సలీమును వదలి ఖుస్రూకు అక్బరుషాహా సామ్రాజ్యాభిషేకము చేయుననుకొనుట కెంతమాత్ర మవకాశము లేదు. ఒకప్పుడు లుత్ఫున్నీసా బేగము మనస్సును రంజింపఁజేసి యిట్లునెను: "మొగలులు రాజపుత్రుల బాహుబలముచే సామ్రాజ్యమును స్థాపించినారు. అట్టి రాజపుత్రులలో మానసింహుఁడగ్రగణ్యుఁడు. అంతేకాక ఖుస్రూకు మేనమామ. ఇదియిట్లుండ ముసల్మానులలోముఖ్యుఁడు ప్రధానమంత్రియునగుఆజిమ్ ఖాను ఖుస్రూకుఁ బిల్లనిచ్చిన మామ. వీరిరువురును సంకల్పించినచో వీరిమాట లెవరు వినకుందురు ? ఇఁక నెవరి యండఁ జూచుకొని యువరాజు సింహాసన మధిష్ఠించును ? మానసింహుని కార్యక్రమమునకుఁ ద్రిప్పుభారము మీది; ఆజిమ్‌ఖానును ముఖ్యులగు మహమ్మదీయ యుమ్మరాహులను వశపఱచుకొనుభారము నాది. మీ యాశీర్వాదముచేఁ గార్యము సఫలమగును. తరువాత ఖుస్రూ సింహాసనమెక్కి దుష్టులను రాజధానినుండి వెడలఁగొట్టును !"

బేగము తన చెలికత్తె యభిప్రాయమును గ్రహించి నవ్వుచు "ఆగ్రాలో నీవే యుమ్మరాహును బెండ్లి చేసుకొనఁగోరె

దవో యతనికిని నీకును బాణిగ్రహణముచేయించెదను. నీభర్త యైదువేల సైన్యమునకు మన్సబుదారు కాఁగల” డనెను.

లుత్ఫున్నీసా సంతుష్టినొందెను. ఆమె యుద్దేశ్య మిది: “రాజధానిలో సామాన్యస్త్రీవలె నుండవలసి వచ్చెనేని యా యాపూవులందు విహరించు మధుకరికి రెక్కలు తుంచిన నేమి సుఖము కలుగును? స్వాధీనత వదలవలసి వచ్చెనేని బాల్యసఖి యగు మెహెరున్నీసాక్రింద దాసిగా నుండు టేమి సుఖము? ముఖ్యుఁ డగు రాజపురుషున కెవనికో భార్యయై యుండుటయే యన్నిటికన్న గౌరవము.”

కేవల మిట్టిలోభముచే లుత్ఫున్నీసా యీకార్యము దల పెట్టెను. సలీము తన నుపేక్షించి మెహెరున్నీసాపై మరులు గొనియుండుటచే నామె కతనిపైఁ బగదీర్చుకొను నుద్దేశ్యము కూడఁ గలదు.

దఢ్లీయందును ఆగ్రాయందునుగల ఆజిమ్‌ఖాను మొదలగు నుమ్మరావులెల్ల లుత్ఫున్నీసా కేదోరీతిని వశులై యుండిరి. ఆజిమ్‌ఖాను తన యల్లునకు మేలుచేయ నుద్యుక్తుఁ డగుట యంత వింతకాదు. అతఁడును నుమ్మరావులును మఱికొంద ఱును సమ్మతించిరి. ఆజిమ్‌ఖాను లుత్ఫున్నీసాతో “ఏదైన దుర్యోగముచే మనకార్యము గట్టెక్కదేని మనకు నిలువ నీడయుండదని తెలిసికొనుము. అందుచేఁ బ్రాణములు రక్షిం చుకొనుట కేదైన నుపాయ మాలోచించి యుంచుకొనుట మంచిది.” అని పలికెను.

"మీ యుద్దేశ్య మేమి ? "

"ఉత్కలదేశముకన్న మనకు వేఱొకయాశ్రయము లేదు. అచటమాత్రము మొగలుల శాసన మంత నిరంకుశముగా నుండదు. ఉత్కల దేశ సైన్యము మన వశమునం దుంచుకొనుట యావశ్యకము. నీయన్న యుత్కలములో మన్నబుదారుగా నున్నాఁడుకదా! యుద్ధములో నతనికి గాయములు తగిలినవని నేను తేపే ప్రకటించెదను. నీవాయనను జూచుటకై యుత్కలమునకుఁ బొమ్ము. అచటఁ జేయవలసిన దంతయుఁ జేసి త్వరితముగాఁ దిరిగి రమ్ము."

లుత్ఫున్నీసా యీయాలోచనమునకు సమ్మతించెను.

౨

నవకుమారునికడ సెలవుదీసికొని మోతీబీబీ యనగా లుత్ఫున్నీసా యాదినముననే వర్ధమానమునకుఁ బోలేకపోయినది. మార్గములో నొక సత్రమం దామె బసచేసి సాయం సమయమున నొకచోటఁ గూర్చుండి పేష్మన్‌తో మాటలాడుచుండగా, "చెలీ, నాభర్తఏలాటివాఁడు?" అనియామె నడిగెను.

పేష్మన్ సించుక విస్మిత యయ్యె, "ఎలాగున నుండవలెను?" అనెను, "చక్కనివాఁడా కాఁడా?" అని లుత్ఫున్నీసా యనెను.

నవకుమారునియెడ పేష్మనుకు సదభిప్రాయము లేదు. లుత్ఫున్నీసా కపాలకుండల కిచ్చిన యాభరణములపైనామె యాశ గొని యేదో మంచియవకాశముచూచి వానిని హరింపవలెనని నిశ్చయించుకొని యుండెను. ఆయాశ యడుగంటి నది. అందుచే కపాలకుండలానవకుమారులయెడ నామెకు సదభిప్రాయము లేదు. కావున నామె యజమానురాలి ప్రశ్నమునకు "దరిద్రబ్రాహ్మణుఁడు సురూపి యయిననేమి కురూపి యయిన నేమి:" యని ప్రత్యుత్తర మిచ్చెను.

మోతీ తనచెలికత్తెభావము గ్రహించి నవ్వుచు "దరిద్ర బ్రాహ్మణుఁ డుమ్మరావయ్యెనేని జక్కనివాఁడు కాఁగలఁడా" యనెను.

,,కా కేమి?,,

"బేగముకోరిక ననుసరించి ఖుస్రూ పాదుషాయయ్యెనేని నాభర్త యుమ్మరావు కాఁగలఁడని నీవేలయనుకొనరాదు?"

"అలాగే యనుకొందును. కాని, మీపూర్వభర్త యుమ్మరా వెట్లు కాఁగలడు?"

"కాకున్న నా కిఁక భర్త యెవ రున్నారు?"

"ముందు కాఁబోవువారు."

మోతీ యించుక నవ్వి "నావంటిసతి కిరువురుభర్తలా? అన్యాయము!—ఎవ రాపోవునది?" అనెను.

మోతీ కపుడు కనఁబడినవాఁడు అజిమ్‌ఖానుని యాశ్రితుఁడు. ఇరువురును వ్యాకులపడిరి. పేష్మను పిలువగా నతఁడు

వచ్చి లుత్ఫున్నీసాకు సలాముచేసి యుత్తర మొకటి చేతి కిచ్చి "నే నీయుత్తరము తీసికొని యుత్కలమునకుఁ బోవు చున్నాను. జాబు చాల జరూరు!" అని విన్నవించెను.

ఉత్తరముఁ జదువుకొనినంతనే మోతీ యాశ లడుగంటి నవి. అం దిట్లున్నది: "మనప్రయత్నము లన్నియు విఫలము లయినవి, మరణసమయమునందుఁ గూడ అక్బరుషాహా తన బుద్ధిబలముచే న న్నోడించినాఁడు. ఆయన పరలోకగతుం డయినాఁడు. తదాజ్ఞచేఁ గుమారుఁడు సలీము జహంగీర్‌షా యైనాఁడు. నీవు ఖుస్రూ విషయమై యాందోళనపడవద్దు. ఇట్టి సందర్భమున నీపై నెవ్వరును శత్రుత్వము సాధింపఁ జాల రు. నీవు శీఘ్రముగాఁ దిరిగి రావలయును."

వీరి పన్నాగము లన్నియు అక్బరుషా యెట్లు విధ్వస్తము చేసెనో యది యంతయు నితిహాసమునఁ గలదు.

బహుమాన పూర్వకముగా దూతను బంపివైచి, లుత్ఫు న్నీసా పేష్మనుకు నుత్తరము వినిపించెను. అంత పేష్మను "ఇఁక నుపాయ మేమి?" అనెను.

"ఇఁక నేయుపాయము లేదు."

"అయినను మంచిదే ఇప్పుడు మాత్రము చెడిపోయిన దేమి? ఇతరరాజులకడ రాణిగా నుండుటకన్న పాదుషాకు భార్యగా నుండుట శ్రేష్ఠమే కదా!"

"అట్లు జరుగదు. ఇఁక నే నారాజధానిలో నుండఁజాలను. త్వరలో మెహెరున్నీసాను జహంగీరు వివాహ మాడును.

చిన్నతనమునుండి యిప్పటివఱకును నేను మెహరున్నీసాను బాగుగా నెఱుఁగుదును. రాజాంతఃపురమునఁ గాలుపెట్టగానె యామెయే పాదుషాయగును. జహాంగీరు పేరునకు మాత్రము పాదుషాగా నుండును. ఆమె సింహాసనమునకు రాఁగ నేను జేసిన కుట్రలన్నియు నామెకుఁ దెలియక మానవు. అప్పుడు నాగతి యే మగును?"

పేష్మను దగ్గుత్తికతో 'అప్పు డే మగును?' అనెను.

"ఒక్కయాసమాత్రముకలదు. జహాంగీరుపై మెహరున్నీసా కెట్టిభావమున్నదో! ఆభావ మెంత దృఢమైనదో! దృఢమే యైనచో మెహరున్నీసాకు జహాంగీరుపై ననురాగము లేక భర్తయెడనే యథార్థముగఁ బ్రేమ యుండెనేని నూర్జహ షేరాఫ్గనులను జంపినను జహాంగీ రామెను దక్కించుకొన లేఁడు. అట్లుగాక నిజముగా మెహరున్నీసాకు జహాంగీరుపై నభిలాషము కలదేని మన కిఁక నాశ లేదు!"

"మెహరున్నీసామనసు మన మెట్లు కనుఁగొనఁ గలము?"

లుత్ఫున్నీసా కసాధ్య ముందునా! మెహరున్నీసా నాకు బాల్య సఖి. వర్ధమానముకుఁ బోయి రెండుదినము లుండినఁ జాలును."

"మెహరున్నీసాకు జహాంగీరుపై ననురాగము లేకున్న మన మేమి చేయవలయును?"

"'క్షేత్రే కర్మ విధీయతే' అని మానాయనగారు చెప్పియున్నారు."

ఇరువురు నించుకతడవూరకుండిరి. మందహాసముతో లుత్ఫు
న్నీసా యధరోష్ఠము కుంచిత మగుచుండ "దేనికి నవ్వుచున్నా
రు," అని పేష్మేన్ ఆమె నడిగెను.

"క్రొత్తయాలోచనము తట్టినది."

"అ దేమి?"

లుత్ఫున్నీసా దానిని పేష్మనుకు దెలుపలేదు.

## 3

ఈసమయమున షేరాఫ్గను వంగదేశపు సుబేదారునధీన
మున నుద్యోగిగా నుండెను.

మోతీబీబీ వర్ధమానమునకువచ్చి షేరాఫ్గనుగృహమున
విడిసెను. షేరాఫ్గను సకుటుంబముగా నామెను సమాదరించి
తనయింటనే యుండ బలవంతపెట్టెను. షేరాఫ్గను నాతని
భార్యయగు మెహెరున్నీసాయును ఆగ్రాలో నుండునపుడు
వారితో నామె కెక్కుడుపరిచయము కలిగెను. ఆమెకు
మెహెరున్నీసాపై నెక్కుడు ప్రేమకలదు. ఢిల్లీసింహాసనవిష
యమున వా రిరువురు ప్రతిస్పర్ధిను లైరి. ఈసందర్భమున
మెహెరున్నీసా యేకాంతమునతనలో నిట్లు దలపోయుచుండెను;
"భారతవర్షమును బాలించుభాగ్య మెవ్వరినుదుట వ్రాసియు
న్నదో విధాతకుం దెలియవలెను. జహాంగీరుకుం దెలియవలెను,

ఇంకెవరికైన దెలియుకేని లుత్ఫున్నీసాకుఁ దెలియవలెను. లుత్ఫున్నీసా యావిషయమేమియు సూచించుటలేదే" ఆమె యుద్దేశ్యము తెలిసికొన వలయుననియే మోతీ ప్రయత్నించు చుండెను.

ఆకాలమున భారతవర్షములో మెహెరున్నీసా యనుపమా నసౌందర్యవతి. నిజముగా నామెవంటిరమణులుభూలోకములో గొలఁదిమంది యేజన్మించుచుందురు. సౌందర్యవతులనియితిహాస మునఁ బొగడొందినజవరాండ్రలో నెల్ల నామె యత్యధిక సుందరి యని యైతిహాసికులే యంగీకరించినారు. ఆకాలపు బురుషులలోఁ జాలమంది విద్యయం దామెకన్న నధికులు లేరు. నృత్యగీతములం దామె యసమాన పాండిత్యముకలది. కవితారచనయందును జిత్రలేఖనమందును నామె యందఱి మనస్సులు రంజించుచుండెను. సరసభావమామెసౌందర్యము కన్న నెక్కుడు మోహపెట్టును. మోతియు నీగుణము లన్నిటి యందును నామెకుఁ దీసిపోదు. నేఁడీ నిపుణ లిరువురు పర స్పర మనోభావములను దెలిసికొన నుత్సుకలై యుండిరి.

మెహెరున్నీసా తనగదిలోఁగూర్చుండి చిత్తరువువ్రాయు చుండెను. తాంబూలము వేసికొనుచు వెనుకఁ గూరుచుండి మోతీ చిత్రలేఖనమును జూచుచుండెను. అపుడు మెహ రున్నిసా మోతీబీబీతో "చిత్తరు వెట్లున్న?" దనెను.

"ఎట్లుండవలయునో య ట్లున్నది. చిత్రలేఖనమందు నీకన్న నిపుణలింకెవరును లేరని విచారపడుచున్నాను."

'నీవు చెప్పినది నిజమైనయెడల విచార మెందులకు?

"చిత్రలేఖన మందు నీవంటి నిపుణ లుండిన నీవదనము నా దర్శము చేసికొని చిత్రము లిఖించియుందురు."

'గోరీమట్టిలోనే యీపాదుముఖ మాదర్శముగా నుండును' అని మెహెరున్నీసా గంభీరముగాఁ బలికెను.

'చెల్లెలా, నేఁడు నీ మనోభావ మిట్లున్న దేల.'

"తేపే నీవు నన్ను విడనాడి పోదు వనుసంగతి యెట్లు మఱవఁగలను? రెండుదినము లుండి మాటలాడి నన్నుఁ గృతార్థురాలి నేల చేయలేవు?"

"సుఖ మెవ్వరు కోరరు? సాధ్య మైనయెడల నేను బోవు దునా? కాని పరాధీనము గదా! ఎట్లుండగలను?"

పూర్వమువలె నీకు నామీఁదఁ బ్రేమ లేదు. ఉండిన యెడల నీ వెట్లో యిచట నుండగలవు. రాఁ గలిగినదాన వుం డుట కేల వీలు కాదు"

నే నా విషయ మంతయుఁ జెప్పితిని. నా సహోదరుఁడు మొగలు సైన్యములో మన్సబ్ దారు. అతఁడుత్కలదేశమున పఠానులతోడి యుద్ధములందు గాయములు తగిలి జబ్బుగా నున్నాఁడు. అతని విపద్వార్త తెలియఁగానే బేగముగారియను మతిని బొంది యతనిని జూచుటకు వచ్చియుంటిని. అచటనే చాల నాలస్య మైనది. ఇఁక జాగు చేయు టుచితము గాదు. నిన్నుఁ జూచి చాల దినము లగుటచే రెండురోజు లుండి పోవచ్చితిని."

"బేగముకడ నెన్ని దినములు సెలవు తీసికొని వచ్చితివి?"

మెహెరున్నీసా నిపుణముగా మాటలాడుచున్నదని మోతీ గ్రహించెను. తీక్ష్ణము మర్మభేదకము నగు నర్మసంభాషణము నందు మోతీ మెహెరున్నీసా యంత నేర్పుకత్తె కాదు. అయినను నప్రతిభ యగునదియుఁ గాదు. మోతీయిట్లనెను. "రాకపోకలకు మూఁడు మాసములు పట్టును. ప్రయాణపు దినములు నిశ్చయించుట యెట్లు? కాని యిప్పటికే చాలకాలము కడచినది. ఇఁక నాలస్యమైనచో నామెవిసుఁగుకొన నచ్చును."

మెహరున్నీసా భువనమోహన మగు మందహాసము చేసి "ఎవరికి విసుఁగు కలుగునని సంశయించుచుంటివి? యువరాజుకా యతని పట్టపుదేవికా?" యనెను.

మోతీ యించుక తెల్లఁబోయి "లజ్జావిహీన నగు నాకు మరల లజ్జ నేలకల్పించెదవు? ఇరువురకును విసుగు కలుగు" ననెను.

"ఒక్క మాట. నీవు స్వయముగా బేగ మేల కాలేదు? యువరాజగు సలీము నిన్ను వివాహమాఁడి పట్టమహిషిని జేసికొను నని వింటిని. అది యెంతవఱకు నిజము"

"సహజముగాఁ బరాధీనను. నాకుఁ గల కొలఁది స్వాతంత్ర్యము నేల కోల్పోవలెను? బేగమునకు సహచారిణి నగుటచే నుత్కలమునకు రాఁగలిగితిని. సలీముకు బేగము నైన, నచటికిఁ బోఁగలనా?"

"నీవు ఢిల్లీచక్రవర్తికిఁ బట్టపుదేవి వైనపుడుత్కలమునకుఁ

బో వలసిన యవసర మేల కలుగును?''

''సలీమునకుఁ బట్టమహిషి నగుటకై యెప్పుడు కాంక్షింప లేదు, ఈహిందూస్థానము దొక్క మెహరున్నీసాయే ఢిల్లీ చక్రవర్తికిఁ బ్రాణేశ్వరి కాఁదగినది.''

మెహరున్నీసా తలవంచుకొని కొంతతడ వూరకుండి మరల నిట్లనెను: ''అక్కా, నీ విట్లు మాటలాడుట నన్ను నొప్పించుటకో కాక నామనస్సు తెలిసికొనుటకో గ్రహింపలేకున్నాను. ఒక్క ప్రార్థనము. త్రికరణ శుద్ధిగా నేను షేరాఫ్గనునకు దాసిని. నీవది మఱచి మాటలాడవలదు''

లజ్జావిహీన యగు మోతీ యీతిరస్కారమున కప్రతిభ కాలేదు; పైపెచ్చామె కవకాశము లభించెను. అంతనామె 'నీవు పతిగతప్రాణ వని చక్కగా నెఱుఁగుదును. అందుచేతనే నీయెదుట నింతఛలోక్తిగా మాటలాడ సాహసించితిని. సలీ మింతవఱకు నీ సౌందర్యము చూచి నిన్ను మోహించి యున్నాఁడని చెప్పుట కిట్లు మాటలాడితిని. సావధానవు కమ్ము' అని పలికెను.

''ఇప్పుడు తెలిసినది. ఇఁక భయ మేమి?''

మోతీ కొంచెము తటపటాయించి ''వైధవ్యము ప్రాప్తించు నని భయము!'' అనెను.

ఇట్లని మోతీ మెహరున్నీసా వదనముపైఁ దీక్ష్ణదృష్టిఁ బఱపెను. భయముగాని యాహ్లాదము గాని యేచిహ్నము గాని యామె ముఖమునఁ గనఁబడలేదు. మెహరున్నిసా

"ఏమీ, వైధవ్యమా? షేరాఫ్గను తనను రక్షించుక
మర్థుఁడు కాఁడు. విశేషించి యక్బరుపాదుషా రాజ
పాదుషా పుత్రుఁడైనను దోషము లేనిది పరుల ప్రా
తీసి తప్పించుకొనలేఁడు!" అని దర్పముతోఁ బలికెన

'నిజమే. కాని మొన్నటి యాగ్రా సమా
లేమన. అక్బరుషా మరణించినాఁడు. సలీము సి
మెక్కినాఁడు, దఢ్లీ చక్రవర్తి నెవ రణఁచఁగలరు."

మెహెరున్నీసా యింక విన లేకపోయెను. ఉలికిపడి
యాపాదమస్తకము కంపింపసాగెను. ఆమె మరల శిరవ
కొనెను. ఆమె లోచనయుగళమునుండి యశ్రుధారలు
హింపసాగెను. "ఎందుల కేడ్చెదవు?" అని మోతీ య

మెహెరున్నీసా నిట్టూర్పు విడిచి, ''సలీము భారత
హాసన మధిష్ఠించిన నాగతి యేమగును?'' అని వాపో

మోతీకోరిక సిద్ధించినది ''నీవు యువరాజు నో
ఱుగా మఱచిపోఁగలవా?" అని యామె యడిగెను.

మెహెరున్నీసా గద్గదస్వరముతో నిట్లనెను: "
మఱవఁ గలను? ఆత్మజీవనమును మఱవఁ గలిగినను ర
జును మాత్రము మఱచిపోలేను. కాని అక్కా, ఒక్క
నా మనఃకవాటమును దెఱచితిని, నీ వంతయు వింటివి
యీ మాటలు మూఁడవచెవిని జేర వని నానమ్మకమ

"మంచిది, అట్లయగుఁ గాక! కాని నేను వర్ధమాన
వచ్చినట్లు సలీమునకుఁ దెలిసెనేని దనను గుఱించి

రున్నీసా యే మన్నదని యడుగును. అపుడు నే నేమని ప్రత్యు త్తర మిత్తును ?”

మెహరున్నీసా కొంచె మాలోచించి “ఇట్లు చెప్పుము: మెహెరున్నీసా తనహృదయములోఁ దమ నెప్పుడు ధ్యానించు చుండును. అవసరమైనయెడలఁ దమ కొఱకుఁ బ్రాణముల నైన నర్పించును; కాని యెప్పుడును గులమానములను సమ ర్పింపదు. తనభర్త జీవించియుండఁగా నీదాసి యెప్పుడును ఢిల్లీచక్రవర్తికిఁ దన మోము చూపింపదు. ఒకవేళ చక్రవర్తి యాజ్ఞానుసారముగా భర్త ప్రాణములు గోలుపోవునేని యాజ న్మమున నామెతో భర్తృహంతకు సమాగమము కలుగదు.” అని వచించి యచటినుండి వెడలిపోయెను. మోతీబీబీ యాశ్చర్యాన్వితయై యుండెను. కాని మోతీకే విజయము కలి గినది. మెహరున్నీసా మనోగతమును నామె గ్రహించెను. మోతీభావమును మెహరున్నిసా యించుకయు గ్రహింపలేక పోయెను. తనబుద్ధిప్రభావముచేఁ దరువాతఁ బ్రభువుపైఁ బ్రభు త్వము చేసిన మెహరున్నిసా యిప్పుడు పరాజిత యయ్యెను. ఇందులకుఁ గారణ మే మన మెహరున్నిసా ప్రణయశాలిని. మోతీబీబీ యిప్పుడు కేవలము మాత్సర్యపరాయణ.

మనుష్యహృదయపు విచిత్రగతులు మోతీబీబీకిఁ జక్కగా దెలియును. మెహరున్నిసా విషయమై యాలోచించి యామె యారాత్రి యేసిద్ధాంతము జేసికొనియుండెనో యదియే నేఁడు యథార్థ మయ్యెను. మెహెరున్నీసా జహంగీరును యథార్థ

ముగాఁ బ్రేమించియున్న దని యామె తెలిసికొన్నది.అందుః
మెహెరున్నిసా నారీసహజమగు దర్పముతో నిప్పు డేమన్నన
నాటంకము లేనపుడు మనోగతిని నిరోధించుటదుస్సాధ్యము
పాదుషాకోరిక యవశ్యము సిద్ధించును.

ఇట్టి సిద్ధాంతముతో మోతీయాశలన్నియు భగ్నములైనవి
కాని యందుచే నామె విస్తారము దుఃఖించినదా ? లేదు
మీఁదు మిక్కిలి నామె కించుక సుఖముకూడఁ గలిగినది
అసంభావ్య మగు నిట్టి చిత్తస్థైర్య మెట్లు కలిగెనో యామె
మొదట గ్రహింప లేకపోయెను. ఆమె యాగ్రాకు వెడః
పోయెను. ప్రయాణములోఁ గొన్ని దినములు గడచినవి.

## ౪

మోతీబీబీ ఆగ్రాచేరెను. ఇఁక నామె కానామముతోఁబః
లేదు. ఈ కొలఁది దినములలో నామె మన స్సంతయు సంపూ
ర్ణముగా మాఱిపోయినది.

తరువాత నామె జహంగీరునుఁ దర్శించెను. అతఁ డామె
బూర్వమువలెనే సమాదరించి యామె సహోదరుని క్షేమ
మును గుఱించియుఁ బ్రయాణసుఖమును గూర్చియు నడిగెను
లుత్ఫున్నీసా తాను మెహెరున్నీసాతో నేమిపలికినదో యదినిః
మయ్యెను. ఆయాసంగతులు మాటలాడిన తరువాత నామె

వర్ధమానమునకుఁ బోయివచ్చినసంగతి యెఱిఁగి జహాంగీరు "మెహెరున్నీసా కడ రెండుదినము లుంటివని చెప్పితివికదా! ఆమె నా విషయమై యేమి మాటలాడినది?" అని యడిగెను. లుత్ఫున్నీసా నిష్కపటహృదయముతో మెహెరున్నీసా యను రాగమును గుఱించి యంతయుఁ దెలియజేసెను. అది విని జహాంగీరు నీరవుఁ డయ్యెను. అతని విస్ఫారిత నేత్రములనుండి యొకటిరెం డశ్రుబిందువులు రాలెను.

"జహాపనా! దాసి శుభవార్త తెలిపినదిగదా! అయినను దాసి కేమియు బహుమానము సెల వీయలేదు!" అని లుత్ఫున్నీసా వచించెను.

పాదుషా నవ్వుచు "బీబీ, నీయాశ యపరిమిత" మనెను.

"జహాపనా, దాసి చేసిన దోస మే మున్నది?"

"ఢిల్లీచక్రవర్తిని నీదాసునిగాఁ జేసికొంటివి కదా! ఇంకను బహుమానము కావలయునా?"

లుత్ఫున్నీసా నవ్వుచు "స్త్రీలకు గోరికలు మెండు" అనెను.

"మరల నే కోరిక గలిగినది?"

"మొదట నీ దాసి ప్రార్థనము, సమగ్రముగా విందు మని పాదుషావా రాజ్ఞ దయసేయవలయును."

"రాజకార్యముల కాటంకము లేనియెడల విందుము."

లుత్ఫున్నీసా నవ్వుచు ఒక్కరికై ఢిల్లీశ్వరుని రాజకార్యముల కాటంకము జరుగదనెను."

"అట్లయిన విందును, కోరిక యేదియో తెలుపుము."

"మఱియొకవివాహము చేసికొనవలెనని కోరికకలిగినది."

జహాంగీరు పకపక నవ్వి ,,ఇది నిజముగాఁ గోత్రకోర్కె యే! సంబంధ మెచటనైన నిశ్చయించితివా?" యనెను.

,,నిశ్చయించితిని. కేవలము పాదుషావారి యాజ్ఞయే తరువాయి. జహాఁపనా సమ్మతింపనియెడల నీ సంబంధము నిశ్చయముకాదు.''

"నాసమ్మతివలనఁ బ్రయోజన మేమి? ఎవరిని నీసుఖ సాగరమునఁ దేల్ప నెంచితివి!"

"ఈదాసి ఢిల్లీశ్వరుని సేవించుచున్న దని వ్యభిచారిణి కాదు. తనభర్తనే మఱల వివాహమాడ దాసి యనుజ్ఞవేఁడు చున్నది."

"నిజముగానే! అయిన నీ ప్రాఁత భృత్యుని గతి యేమి చేసెదవు?"

"ఢిల్లీచక్రవర్తిని యగు మెహరున్నీసా నిచ్చిపోయెదను"

"ఢిల్లీచక్రవర్తిని యగు మెహరున్నీసా యెవరు?"

"ఎవ రయ్యెదరో వారు."

మెహరున్నీసా చక్రవర్తిని యగు నని లుత్ఫున్నీసా ధ్రువముగా నెఱుఁగు ననియుఁ దన యభిలాషము విఫల మగుటచే విరక్తయై రాజాంతఃపురమునుండి వెడలిపోవఁ జూచుచున్న దనియు జహాంగీ రనుకొని యించుక విచారముతో నీరవుఁ డయ్యెను. అంత లుత్ఫున్నీసా "ప్రభువుగారి కీసంబంధ మిష్టము లేదా!" అనెను.

"ఇష్టము లేకపోలేదు. కాని నీభర్తనిపుడు మరలవివాహో మాడు నవసర మేమి వచ్చినది?"

"తలవ్రాతచే మొట్టమొదట నాభర్త నన్ను భార్యగా గ్రహింపలేదు. జహాపనా తమదాసి నిపుడువదలిపెట్ట లేరు"

పాదుషా లోలో నవ్వుకొని తరువాత గంభీరభావము వహించి "ప్రేయసీ, నీకు నే నీయరాని దే మున్నది. నీ కేది యిష్టమో యదే కానిమ్ము కాని నన్ను వదలిపెట్టి యేల పోవలయును. ఒక్కయాకాశముననే సూర్యుడును జంద్రుడును బ్రకాశించుట లేదా? ఒక్కతొడిమను రెండుపుష్పములు పుష్పించుటలేదా?" యనెను.

లుత్ఫున్నీసా కనులు పెద్దవి చేసి పాదుషావంకజూచుచు "చిన్ని పూలు పూచును గాని యొక్కతూటిన రెండు కమలములు పుష్పింపవు? నే నిక రత్నసింహాసనము కడ గంటకమువలె నేల యుండవలయు?"ననెను.

లుత్ఫున్నిసా తనగృహమునకు వెడలిపోయెను. తన కిట్టి వాంఛ యేల కలిగినదో యామెజహాంగీరుకు వ్యక్తముచేయ లేదు. అనుభవమువలన నెట్లు గ్రహింపవలయునో యతడట్లు గ్రహించి సరిపెట్టుకొనెను; కాని నిగూఢమైనయామెముఖ్యోద్దేశ్యమునుగ్రహింపలేదు. లుత్ఫున్నీసా హృదయముపాషాణము. రమణీహృదయములను జయించు జహంగీరు రాజకాంతియు నామెహృదయమును మోహపెట్టలేదు. కాని యీసారి పాషాణములో గీటకము ప్రవేశించినది.

౫

లుత్ఫున్నీసా ప్రఫుల్ల హృదయముతో పేష్మనును బిలిచి వేష భూషణములఁ దీసి వైచెను. సువర్ణముక్తాలంకృతము లగు వస్త్రములు విసర్జించి, 'పేష్మన్, వీనిని దీసికొనుము' అని పలికెను.

పేష్మ నించుక యాశ్చర్యపడెను. వస్త్రములు బహుధన వ్యయముచేఁ దయారు చేయించినవి. "ఈవస్త్రములు నా కేల ? నేఁటివార్త యేమి ?"

"శుభవార్తయే."

"అది తెలియుచునే యున్నది. మెహెరున్నీసాభయము కలఁతపెట్టుచున్నదా?"

"అవును. ఆవిషయమై యిప్పు డేవిచారము లేదు."

పేష్మ నత్యంతాహ్లాదము ప్రకటించుచు "నేనిపుడు బేగ ముగారి దాసి నైతిని!" అని పలికెను.

"నీవు బేగముగారి దాసివి కాఁగోరెదవేని మెహెరున్నీ సాతోఁ జెప్పెదను"

"మెహెరున్నీసా పాదుషావారికి బేగ మగుట యెంత మాత్రము తటస్థింప దని మీరే చెప్పితిరిగదా!"

"నే నట్లు చెప్పలేదు నా కావిషయమై యిప్పు డేవిచా రము లే దని చెప్పితిని!"

"విచార మేల లేదు ? మీ రొక్కరే దఢిల్లీ కధికారిణులు

కాకున్న నిది యంతయు వ్యర్థము."

"ఆగారితో సంబంధము పెట్టుకొనుట లేదు."

"అదేమి? నాకేమియుఁ దెలియుట లేదు. ఇది శుభవార్త యెట్లయినదో చెప్పుడు!"

"ఆగారి వదలిపెట్టి పోవుటయే శుభవార్త."

"ఎచటికిఁ బోయెదరు?"

"వంగదేశమునకుఁ బోయెదను. వీలుగా నున్న సద్వంశజు నకు గృహిణి నయ్యెదను."

"ఇది క్రొత్త చమత్కారమే! కాని వినినంతనె నాకుఁ బ్రాణములు కడఁబట్టుచున్నవి!"

"నిజముగానే ఆగారి వదలిపెట్టి వెళ్ళుచున్నాను. పాదుషా వారికడ సెలవు కూడఁ దీసికొని వచ్చినాను."

"మీకు దుర్బుద్ధి పుట్టినదా యేమి?"

"దుర్బుద్ధి కాదు. చాలదినములనుండి ఆగారిలో విహరించి తిని. కాని యేమి లాభము కలిగినది? బాల్యమునుండి సుఖ తృష్ణ ప్రబలముగానున్నది. ఈతృష్ణాతృప్తికై వంగదేశము వీడి యింతవఱకు వచ్చితిని. ఈసుఖమును గొనుటకై యెంత ధనము వెచ్చించితిని! ఎన్ని దుష్కార్యము లాచరించితిని! ఏ యుద్దేశములతో నింత దూరము ప్రయత్నించితినో యం దొకటియు సఫలము కాలేదు. ఐశ్వర్యము, ధనము, గౌర వము, ప్రతిష్ఠ—అన్నియు నెంతగా ననుభవింప వలయునో యంతగా ననుభవించితిని. ఇంత యనుభవించినను నేమైనది.

నేఁ డిచటఁ గూర్చుండి గతించిన దినములు జ్ఞప్తికిఁ దెచ్చు కొని చూచినయెడల సుఖపడిన దిన మొకటియైన గనుపిం చదు. చివర కొక్కముహూర్తమైన సౌఖ్య మనుభవించి యెఱుఁగను. ఎప్పుడును నాకుఁ బరితృప్తి కలుగ లేదు. తృష్ణ మాత్రము వృద్ధియగుచున్నది. సంకల్పించితినేని యింకను సంపదలను నింకను నైశ్వర్యము ననుభవింపఁగలను. కాని యెందులకు? ఈ యన్నిటిలో సుఖమున్న యెడల నిన్నిదినము లలో నొకదినమైన సుఖపడియుందును ఈ సుఖవాంఛ కొండ వాఁగువంటిది. మొదట నిర్మలమై సన్నధారతో నిర్జన ప్రదేశ మునుండి బయటఁ బడును. తనగర్భమునందే దాగి యుండి యెవరికిని గోచరింపక తనలోఁ దానే కలకలనినాద మొన ర్చును; ఎవ్వరికిని వినఁబడదు. క్రమ క్రమముగా దూరము పోయిన కొలఁది దాని శరీర మెంత వృద్ధి యగునో యంత పంకిల మగును. కేవల మంతేకాదు. ఎచట నుండియో వాయువు వీచును. తరంగము లుద్భవించును. కుంభీరాదు లందుఁ జేరును. దాని శరీరము వృద్ధి యగును. జలముగూడ మఱింత బురద యగును. లవణమయ మగును. అనేకము లగు సైకతభూములు మరుభూములునదీయహృదయమున నేర్ప డును. వేగము మందమై పోవును. అప్పుడు కర్దమమయమగు నానదీ శరీర మెచట నపార పారావారమున మిళితమై పోవు నో యెవరు చెప్పఁగలరు?”

“నా కిం దించుకయు బోధపడలేదు, ఇవన్నియు మీకు

సుఖ మేల కావు?"

"ఏల కావో నేఁడు తెలిసికొన్నాను. మూఁడుసంవత్సరములనుండి ప్రాసాదచ్ఛాయలోఁ గూర్చుండియు ననుభవింపని సుఖ ముత్కలమునుండి వచ్చునపుడు త్రోవలో నొక రాత్రి యనుభవించి యుంటిని. అప్పుడు గ్రహించితిని?"

"ఏమి గ్రహించితిరి?"

"నే నింతకాలము భారతీయుల దేవతా విగ్రహమువలె నున్నాను. బయట సువర్ణరత్నఖచితము, లోపలఁ బాషాణము, ఇంద్రియ సుఖములకై యగ్నిలోఁ దిరుగుచుంటినికాని యాయగ్ని నన్ను స్పృశింప లేదు. ఒక్కసారి వెదకిచూడ నీ పాషాణములో రక్తనాళవిశిష్టమగు నంతఃకరణము పొడకట్టినది."

"ఇదియు నాకుఁ దెలియలేదు."

"ఈ యాగ్రాలో నెప్పుడైన నెవరినైనఁ బ్రేమించితినా?"

"ఎవరినిఁ బ్రేమింప లేదా!"

"ఇకఁ బాషాణహృదయ నేల కాను."

"ప్రేమింపవలె ననుకోరికయే యున్న నిపు డేల ప్రేమింపరాదు?"

"అదే యాలోచనము. అందులకే యాగ్రా విడిచి పోవుచున్నాను."

"అది మాత్ర మేమి ప్రయోజనము? ఇచట మనుష్యులు లేరనియా యాకిరాత దేశమునకుఁ బోవుట? ఇచ్చట

మాత్రము మీ యిష్టమైనవారి నేల ప్రేమింపరాదు? రూపమందును నైశ్వర్యమందును దక్షిణాపథమునాకన్న నధికు లెవరున్నారు?"

"సూర్యచంద్రు లాకాశమం దుండ జల మధోగామి యెందుల కగుచున్నది?"

"ఎందులకు?"

"నుదుటివ్రాఁత!"

లుత్ఫున్నీసా మనసు విప్పి చెప్పలేదు. పాషాణమధ్యమం దగ్ని ప్రవేశించినది! పాషాణము కరఁగుచున్నది!

## ౬

క్షేత్రమందు బీజమును నాఁటిన నది తనంతనే యంకురించును. ఎప్పు డంకురించునో యెవ్వరికినిఁ దెలియదు. ఎవ్వరికినిఁ గనఁబడదు. కాని యొకసారి బీజమును నాఁటినతరువాత నాఁటినవాఁ డెచట నున్నను సరియే, యది క్రమముగా నంకురించి మొలకయై తల యెత్త నారంభించును. నేఁడా మొక్క యంగుళప్రమాణమాత్ర ముండును. చూచియు దాని నెవ్వరు లక్ష్యము చేయరు. కొంచెముకొంచె మది వృద్ధియగుచు జేనెఁడై, మూరెఁడై రెండుమూరల పొడవు పెరుఁగును. అప్పటికిని దానివలన స్వార్థసిద్ధియగు తలఁపు కలుగదేని దాని

నెవ్వరును జూడరు. చూచినను లక్ష్యము చేయరు. దినములు
గడచును. మాసములు గడచును, సంవత్సరములు గడచిపో
వును, క్రమముగా జనులు దానిని జూడ నారంభింతురు. ఇంక
నది జనులకుఁ గోచరము కాకుండ నుండ లేదు. వృక్షమై తన
నీడలోఁ బెరుఁగు నితర వృక్షములకు హాని చేయును. ఆక్షేత్ర
మందుఁ దా నొకటియే వృక్షముగా నుండవలయు నని దాని
కోరిక కాఁబోలు.

లుత్ఫున్నిసా ప్రణయ మీరీతి వృద్ధినొందెను. మొదట
నామె తన ప్రణయభాజనుని దలఁచని తలంపుగా సందర్శిం
చెను. అప్పు డామె తనలోని ప్రణయసంచారము నంతగాఁ
దెలిసికొన లేదు. కాని యప్పుడే బీజము నాఁటుకొన్నది.
మరల నామె కాతని దర్శనము కా లేదు. పరోక్షమం దాతని
ముఖమండలము మాటిమాటికి నామెమనోనేత్రమునకుఁ బొడ
కట్టసాగెను. స్మృతిపటమున నాతని ముఖమును జిత్రించు
కొనుటవలన నామె కించుక సుఖము కలుగ సాగెను. మొక్క
మొలిచినది. చిత్రితమూర్తిపై నామె కనురాగము జనిం
చెను. దేని విషయమై మానసికవ్యాపార మెక్కువగా జరు
గునో యది యంత దృఢపడుట యంతఃకరణధర్మము. క్రమ
ముగా నా మనోవ్యాపారము స్వభావసిద్ధ మగును. లుత్ఫు
న్నిసా తన మనస్సునం దామూర్తిని బ్రత్యహము భావింప
నారంభించెను. అందుచే నామె కనివార్యమగు దర్శనకాంక్ష
జన్మించెను. వరుసగా నా దర్శనకాంక్షా ప్రవాహము సహజ
మై దుర్నివార్యము కాసాగెను. ఢిల్లీసింహాసనాపేక్షయు

దానిముందు స్వల్పముగాఁ దోఁచెను. సింహాసన మామెకు మన్మథశరానలజ్వాలాసంకలిత మని దృఢపడసాగెను. రాజ్యము, రాజధాని, సింహాసనము—సర్వము విసర్జించి ప్రియజన సందర్శనార్థ మామె పరుగెత్తి వచ్చెను. ఆ ప్రియుఁడు నవ కుమారుఁడు.

అందుచేతనే 'మెహెరున్నీసా తన యాశలను నాశనము చేసిన సంగతి నెఱిఁగియు నామె విచారపడలేదు. ఆ కారణముననే ఆగ్రాకు వచ్చియుఁ దనసంపదను రక్షించుకొన నామె ప్రయత్నింపలేదు. అందులకే యామె పాదుషాకడ శాశ్వతముగా సెలవు దీసికొని వచ్చినది.

లుత్ఫున్నీసా సప్తగ్రామమునకు వచ్చి రాజ మార్గమునకు సమీపముగా నగరములో నొక మేడయందుఁ దన నివాస మేర్పఱచుకొనెను. రాజమార్గమునఁ బోవువారి కా సౌధ మాకస్మికముగా సువర్ణవస్త్రభూషితముగను దాస దాసీజనపరివేష్టితముగను గనుపట్టెను. సౌధమందలి ప్రతి కక్ష్యమందును నలంకార మతిమనోహరముగ నుండెను. సుగంధద్రవ్యములు పన్నీరు పుష్పములు నలుదెసల నామోద ముతో నింపివేయుచుండెను. స్వర్ణ రౌప్య గజదంత నిర్మితము లగు నానావిధ వస్తువులు గృహములో నెల్లచోటుల నలంకరింపఁబడియుండెను. ఈ విధమున నతిమనోజ్ఞముగా నలంకృత మగు నా సౌధములో నొక కక్ష్యమం దధోవదనయై లుత్ఫున్నీసా కూర్చుండియుండెను. ఆమె యిదివఱ కొకటి రెండు

సారులు సప్తగ్రామమునకువచ్చి నవకుమారునిసందర్శించినది. అందువలన నామె మనోరథ మెంతవఱకు సిద్ధించినదో యీ సంభాషణము వలనఁ దెలియఁగలదు.

నవకుమారుఁ డించుకతడవూరకుండి, "వెళ్లుచున్నాను. నన్నింక నీవు పిలిపింప వల" దనెను.

"పోవలదు. ఇంకఁ గొంచె ముండుఁడు నేను జెప్పఁ దలఁచుకొన్న దింకను బూర్తిగాఁ జెప్పలేదు."

నవకుమారుఁ డింకొక క్షణము ప్రతీక్షించెను. కాని యామె యేమియు మాటలాడలేదు. ఇంకొక క్షణము గడచిన తర్వాత నతఁడు "ఇంక నేమి చెప్పెదవు?" అనెను. ఆమె యేమియు బదులుపలుకక నిశ్శబ్దముగా నేడ్చుచుండెను.

నవకుమారుఁ డది చూచి నిలువఁబడెను. ఆమె యతని వస్త్రాగ్రము పట్టుకొనెను. ఆతఁ డించుక విసుఁగు కొనుచు "ఏమో చెప్పరాదా?" అనెను.

"మీ కేమి కావలయును! ఈ ప్రపంచమందు మీరు కోరఁదగిన దేదియు లేదా? ధనము సంపద గౌరవము ప్రణయము—ఈ ప్రపంచమునందు సుఖదాయకములగునవి యే వేవి కలవో వాని నన్నిటి నిచ్చెదను. ప్రత్యుపకార మెంత మాత్రముఁ గోరను. కేవలము మీకు దాసి నయ్యెదను. మీకుఁ బత్నినగు గౌరవముగూడఁ గోరను. కేవలము దాసి కాఁగోరెదను."

"నేను దరిద్రబ్రాహ్మణుఁడను. ఈజన్మమం దిట్లె యుం

దున్నది. నీ విచ్చు నైశ్వర్యాదులు గ్రహించి యవనీజారుఁడను మాత్రము కాలేను.''

యవనీజారుఁడా! ఇంతవఱకును నవకుమారుఁ డీయవన యువతి తనపత్ని యని తెలిసికొనలేదు. లుత్ఫున్నీసా యధో వదనయై యుండెను. అతఁడామె చేతినుండి తన వస్త్రముకొంగు లాగికొనియెను. ఆమె మరల నాతని కొంగుఁబట్టుకొని "మంచిది! అది పోనిండు. లలాటలిఖిత మట్లున్న నా చిత్తవృత్తుల నన్నిటిని బాతాళగంగలోఁ గలిపెదను. ఇఁక నేమియుఁ గోరను. మీ రప్పుడప్పు డిచటికి వచ్చిపోవుచుండుఁడు. నన్ను మీదాసిగా నెంచి యప్పుడప్పుడు దర్శనము మాత్ర మిందు' కేవలము చక్షుఃప్రీతి కావించుకొందును" అని వేడుకొనెను.

"నీవు యవనివి, పరకాంతవు. నీయెడ నిట్టికృత్యము గూడ దోసమే యగును. ఇఁక నీకుఁ గనఁబడ నైనఁ గనఁబడను.''

కొంచెము సేపామె మిన్నకుండెను. ఆమె హృదయమునఁ దుపాను చెలరేఁగుచుండెను. శిలావిగ్రహమువలె నామె నిష్పందముగా నుండెను. తుద కతని కొంగు వదలిపెట్టి యామె, 'పొండు' అని పలికెను.

నవకుమారుఁడు బయలుదేఱి రెండుమూఁడడుగులు వేసి నంతనే తటాలున నామె వాతోన్మూలితపాదపమువలె నాతని కాళ్ళపైఁబడి తన బాహులతలతో నాతనిపాదములు బంధించి సకరుణముగా "నిర్దయుఁడా! నేను మీకొఱకు ఆగ్రాసింహాసనముగూడ విసర్జించి వచ్చితిని. నన్ను బరిత్యజింపకుఁ"డనెను.

"నీవు మరల నాగ్రాకుఁ బొమ్ము. నా యాశ వదలుకొనుము." "ఈజన్మమున వదలను" అని బాణమువలె లేచి నిలుచుండి సదర్పముగా "ఈ జన్మమున మీ యాశ వదలుకొనను" అని శిరము పైకెత్తి, గ్రీవాభంగ మొనర్చి విశాల నేత్రిములతో తెప్ప వాల్పక రాజరాజసమ్మోహిని యగు నామె నవకుమారునివంకఁ జూచుచు నిలుచుండెను. ఇది వఱకు హృదయాగ్నిలో ద్రీపీభూతమైన యామె దర్పము మరలఁ దేజముతోఁ బ్రజ్వలించెను. భారత సామ్రాజ్యమును శాసించు సంకల్పమునందు భయముఁ జెందని యామె యజయ్య మానసికశక్తి మరలఁ బ్రణయముచే దుర్బలమైన యామె శరీరమునందు సంచరించెను. లలాటమందలి నాడు లన్నియు నుబికి రమణీయరేఖలుగాఁ గనఁబడుచుండెను. మార్తాండతీక్ష్ణాంశువులచే ధగధగలాడు సముద్రజలమువలె నామె జ్యోతిర్మయనేత్రములు ప్రజ్వలించుచుండెను. ఆమె నాసాపుటములు కంపించుచుండెను. తరంగిణియందు విహరించు రాజహంసి తన గమనమును నిరోధించు వానిని గ్రీవాభంగముతో నెట్లు వీక్షించునో, యా హతఫణయగు భుజంగిని తన పడగ నెత్తి యెట్లు చుఱచుఱఁ జూచునో యట్టు లున్నాదిని యగు యవనయువతి తన మస్తక మెత్తి "ఈజన్మమునందు వదలి పెట్టను. మీరు నా వారలే కావలయును?" అని వక్కాణించెను.

ఆ కుపితభుజంగినీమూర్తివంకఁ జూడఁజూడ నవకుమారునకు భయము కలిగెను. అనిర్వచనీయ మగు నామె దేహ

మహిమ నేఁడు కనఁబడిన ట్లెప్పుడును గనఁబడలేదు. అశనిపాత సూచకమగు విద్యుల్లతవలె నా శోభ మనోహరమయ్యును జూచుటకు భయముకలిగించుచుండెను. నవకుమారుఁడు వెడలిపోవువాఁడే కాని తటాలున నతని కొక తేజోమూర్తి జ్ఞప్తికిఁ దగిలినది. ఒక దినమున నతఁడు తన ప్రథమ పత్నియగు పద్మావతి యెడ విరక్తుఁడై యామెను దనశయనాగారమునుండి వెడల నడవ నుద్యుక్తుఁడయ్యెను. ద్వాదశవర్షీయ యగు నాకన్య దర్పముతో నాతని యెదుటికి వచ్చి నిలువఁబడెను. అప్పుడును నిదే రీతి నామె నేత్రములుజ్వలములయ్యెను. అప్పుడును నామె లలాట మీలాగే రేఖావికసితముగ నుండెను. ఇట్లె యామె నాసాపుటములు కంపించెను. ఈవఘువననే యామె మస్తక మెత్తియుండెను. బహుకాలము నుండి యామూర్తి మనోగోచరము కాలేదు. నేఁడతనికి జ్ఞప్తికివచ్చినది. ఆమె పోలికయే యీయామెయం దతనికిఁ బొడకట్టినది. సంశయగ్రస్తుఁడై నవకుమారుఁడు సన్నని కంఠస్వరముతో మెల్లగా "నీ వెవరు?" అని యామెను బ్రశ్నించెను.

యవనయువతి తన విశాలనేత్రము లింకను విస్తరించి, "నేను పద్మావతిని," అని బదులు చెప్పెను.

ప్రత్యుత్తరమునకుఁ బ్రతీక్షింపక లుత్ఫున్నీసా యటనుండి వెడలిపోయెను. నవకుమారుఁడు సంశయగ్రస్తచిత్తుఁడై తన గృహమునకుఁ బోయెను.

౭

ఇంకొకగదిలోనికిఁ బోయి తలుపులు బిగించికొని రెండు దినములవఱకు లుత్ఫున్నీసా బయటికి రాలేదు. ఈరెండుదినములలో నామె కర్తవ్యమును నిర్ధారించుకొని దృఢప్రతిజ్ఞయయ్యెను. సూర్యభగవానుఁ డస్తమించెను. అప్పుడు లుత్ఫున్నీసా పేష్మన్ సాయముతో నాశ్చర్యకరమైన వేషభూషణములుధరించెను. అంత నామె తనవేషము నద్దములోఁ జూచుకొని, "పేష్మన్, నన్నెవరైన గుర్తింపఁగలరా?" అని యడిగెను.

"ఎవరికి సాధ్య మగును?"

"అయిన నేను వెళ్లుచున్నాను. నావెంట సేవకు రాండ్రెవరును రా నక్కఱ లేదు?"

పేష్మ నించుక భయముతో "దాసి యపరాధము క్షమింతురేని మిమ్మొక ప్రశ్న మడిగెదను."

"ఏమది?"

"మీ యుద్దేశ్య మేమి?"

"బహుశః కపాలకుండలకు నామెభర్తకు శాశ్వతవిచ్ఛేదము సంఘటించెదను. తరువాత నతఁడు నావాఁ డగును."

"బీబీ, చక్కఁగా నాలోచింపుఁడు. అడవి దట్టమైనది రాత్రి పడుచున్నది. మీ రొక్కరు!"

లుత్ఫున్నీసా యేమియు బదులు పలుకక యింటినుండి

బయటికి వచ్చి సప్తగ్రామములో నిర్జనారణ్యమయ మగు నుపనగర ప్రాంతమందుండు నవకుమారుని గృహము వైపునకు బయలు దేరెను. అచటికిఁ బోవునప్పటికి బాగుగాఁ జీఁకటి పడెను. నవకుమారుని గృహమునకు సమీపమునఁ గ్రిక్కిఱిసినయడవి యొకటి కలదని యిదివఱకే చెప్పియుంటిమి. తద్వ్యాపిన ప్రాంత భూమికి వచ్చి లుత్ఫున్నీసా యొక వృక్షము కడఁ గూర్చుండి తాను జేయవచ్చిన దుస్సాహసికకృత్యముగుఱించి యాలోచింప నారంభించెను: తగిన ట్లామె కనుకొనని సాయము కూడ లభించెను.

నిరంతరము సమానోచ్చరితము మనుష్యకంఠవినిర్గతము నగు శబ్ద మామె కూర్చుండినచోటికి వినవచ్చెను. లేచి నిలుచుండి నలుదెసలు పరిశీలింప నామె కరణ్యములో నొకచోట వెలుతురు కానఁబడెను. లుత్ఫున్నీసా సాహసమునందుఁబురుషునికన్న నెక్కువ. వెలుతురు కనఁబడిన చోటికిఁ బోయి యొక వృక్షముచాటుననుండి చూడ నది హోమాగ్నిప్రకాశమని యామెకుఁ దెలిసెను. ఆమెకు వినఁబడినది మంత్రోచ్చారణశబ్దము. మంత్రములలో నొక్కమాట మాత్ర మామె తెలిసికొనఁ గలిగెను. అది యొకరి పేరు. ఆ పేరు వినఁబడినంతనే యామె హోమము చేయువాని కడకుఁ బోయి కూర్చుండెను.

# చతుర్థఖండము

## ౧

లుత్ఫున్నీసా ఆగ్రాకుఁ బోయి సప్తగ్రామమునకుఁదిరిగివచ్చు లోపల సంవత్సరము గడచెను. కపాలకుండల నవకుమారుని గృహిణియై సంవత్సరము దాఁటినది. ఏనాఁటి ప్రదోషకాలమున లుత్ఫున్నీసా యడవికి వెళ్ళినదో యాసాయంసమయమున కపాలకుండల యనన్యమనస్కయై తనపడక గదిలోఁగూర్చుండియుండెను సముద్రతీరమున నాలోలకుంతలయు నలంకారవిహీనయు నగు కపాలకుండలను జూచియుంటిమి. ఇప్పుడామె యాకపాలకుండల కాదు. శ్యామసుందరి వచించిన భవిష్యద్వాణిసత్యమయ్యెను. స్పర్శమణిసంయోగముచే యోగిని గృహిణి యయ్యెను. అత్యధికకృష్ణోజ్జ్వలము, భుజంగినీవాలోపమము, నాజానులంబితము నగు నామె కేశరాశి యిప్పుడు సాంద్రవేణిగా సంబద్ధమైనది. వేణీరచనయందుఁ గూడ శిల్పచాతుర్యము కనబడుచున్నది. కేశవిన్యాసమందుఁ గల సూక్ష్మములగు చిత్రములచే శ్యామసుందరికిఁ గల కౌశలము బోధపడుచున్నది. కుసుమదామములు గూడఁ బరిత్యక్తములుకాలేదు. తలచుట్టును జడ కిరీటమువలెఁ జుట్టియున్నది. జడ యం దిముడక పైకివచ్చిన చిన్నిచిన్ని శిరోజములు నిమ్నోన్నతములు కలిగి కృష్ణతరంగరేఖలవలె శోభిల్లుచున్నవి. ముంగురులిప్పుడు ముఖమండలమును గ్రమ్ముకొనియుండలేదు. వదన మిప్పుడు మఱింత శోభావంతముగనున్నది.

చెదరిన ముంగురులు చెమటకుఁ దడసి యచ్చటచ్చట ముఖముపైఁ వ్రాలియున్నవి. ఆమెశరీరచ్ఛాయ యిప్పు డర్ధోదిత పూర్ణశశాంక కాంతిని గేరుచున్నది. ఇప్పుడామె కర్ణములందు హేమకుండలములు మెఱయుచున్నవి. కంఠమందు సువర్ణాభరణములు ప్రకాశించు చున్నవి. ఆయాభరణము లామె శరీరచ్ఛాయకతఁ గాంతివిహీనములు గాక యర్ధచంద్రికాము దీవసన యగు ధరణీదేవి శరీరమందలి నిశాకుసుమములవలె శోభిల్లుచున్నవి. ఆమె తెల్లని వస్త్రము ధరించినది. ఆశ్వేతాంబర మర్ధచంద్రప్రదీప్తమగు సంకీర్ణధవళాంబుదమువలె విరాజిల్లుచున్నది.

ఆమెశరీరకాంతి యర్ధోదితేందు ప్రకాశసదృశమే, కాని పూర్వముకంటె నించుక మాసి గగనాంచలమున నెచటనో వ్రేలు నీలమేఘమువలెఁ గానఁబడుచున్నది. కపాలకుండల యొక్కతె కూర్చుండి యుండలేదు; శ్యామసుందరి యామె చెంత నున్నది.

"అన్నగా రింక నిచట నెన్నిదినములుందురు?" అని కపాలకుండల యడిగెను.

"రేపు సాయంకాలము వెళ్లుదురు. అయ్యో, నేఁటిరాత్రి యోషధిని దీసియుంచినయెడల దానివలన వారిని వశముచేసికొని నా జన్మము సార్థకము చేసికొనియుందును. క్రిందటిరాత్రి బయటికి వెళ్లితి నని చీవాట్లు తిన్నాను. నేఁడు బయటికి బోవు టెట్లు?"

"పగలే యేల తీయఁ గూడదు?"

"పగలు తీసిన నెట్లు ఫలించును? సరిగా రెండుజాముల రాత్రివేళఁ దీయవలయును. మా యన్నతోఁ జెప్పఁగా మన స్సులోఁ బెట్టుకొని యూరకున్నాఁడు."

"మంచిది. నేఁడు నే నాయోషధి యరణ్యములో నెచట నున్నదో పగలే పోయి చూచివచ్చెద. నేఁడు నీవు గృహము విడచి బయటికి రానక్కఱలేదు. నే నొక్కతెనే పోయి యోషధిఁ దీసికొనివచ్చెదను."

"ఒకనాఁడు పోయివచ్చినందులకై పడినపాట్లు చాలును. నీ విఁక రాత్రి బయటికిఁ బోవలదు."

"అందుకై నీకు విచార మేల? చిన్ననాఁటనుండి రాత్రి వేళ బయటఁ దిరుగుట నాకభ్యాస మని చెప్పితినికదా. నా కట్టి యభ్యాసము లేకున్న నీకు నే నెప్పుడును గనఁబడి యుండను."

"ఆ భయముచేతఁ గాదు. ఒంటరిగా రాత్రివేళ నరణ్య మందుఁ దిరుగుట యిల్లాండ్రకు మంచి దగునా! ఇరువురము వెళ్ళినప్పుడే చీవాట్లు తగిలినవి. ఇఁక నీ వొక్కతెవు పోయిన శరణ ముండునా?"

"ఆటంక మేమి? రాత్రివేళ యిల్లు వదలి బయటికిఁబోయి నచో నేను దుశ్చరిత్ర నగుదు నని తలఁచుచున్నావా;"

"నే నట్లు తలఁచుట లేదు. అల్పు లల్పముగా మాట లాడెదరు."

"మాటలాడ నిమ్ము: అందువలన నేను జెడ్డదానను గాను."

"నీవు చెడ్డదాన వెప్పటికిని గావు. పలుగాకు లెవ్వరైన నట్టి చెడ్డమాటలు పలికిన నా మనస్సునకుఁ గష్టము కలుగును?"

"ఇట్టి యన్యాయపుమాటలవలన బాధపడవద్దు."

"అన్నగారి మనస్సు నేల కష్టపెట్టవలెను!"

కపాలకుండల స్నిగ్ధోజ్జ్వలము లగుకటాక్షములు ప్రసారించి శ్యామసుందరివంకఁ జూచుచు "ఇందువలన వారి మనస్సునకుఁ గష్టము కలిగిన నే నేమి చేయఁగలను? వివాహమన స్త్రీలకు దాస్య మను సంగతి నెఱిఁగి యుండిన నేను వివాహ మాడియే యుండను." అని పలికెను.

అటుపైన మాటలాడుటకు శ్యామసుందరికిఁ బాగుగాఁ దోఁచలేదు ఆమె గృహకృత్యములు నిర్వర్తింపఁబోయెను.

కపాలకుండలయు గృహకార్యములు ముగించి యోషధిని గొనివచ్చుటకై యింటినుండి బయలుదేఱెను. అప్పటికిజాము పొద్దుపోయినది; వెన్నెల. నవకుమారుఁడు వెలుపలి వసారాలోఁ గూర్చుండియుండెను. కపాలకుండల బయటికిఁ బోవుటఁ జూచి యతఁ డనుసరించి యామెచేయి పట్టుకొనెను. కపాలకుండల, "ఏందు" కనెను.

"ఎచటికిఁ బోవుచున్నావు?"

నవకుమారునికంఠస్వరమున దిరస్కారసూచన యేమియు లేదు.

8

"శ్యామసుందరి భర్తను వశపఱచు కొనుటకై యొక యోషధి కోరినది. నే నా యోషధిని వెతకఁ బోవుచున్నాను."

నవకుమారుఁడు పూర్వమువలె మృదుస్వరముతో, "నిన్న నొకసారి పోయి యుంటివి కదా? మరల నేఁ డెందులకు?" అనెను.

"నిన్న గనఁబడ లేదు నేఁడు మరల వెదక వలయును?"

"మంచిది. పగలు వెదకఁ బోఁగూడదా?"

అతని కంఠస్వరము స్నేహార్ద్రపూర్ణము.

"పగ లా యోషధి పనిచేయదు."

"నీ కింతశ్రమ మెందులకు? దానిపేరు చెప్పు, నేను తెచ్చి యిచ్చెదను."

"చూచిన గుర్తింపఁ గలను, గాని దానిపేరు నాకుఁ దెలియదు. అంతేగాక మీరు తీసుకొని వచ్చినను నది పనిచేయదు. స్త్రీలు తల విఱియఁబోసికొని దానిని బెల్లగించుకొని రావలయునఁట. పరుల కుపకారము చేయునపుడు మీ రాటంక పెట్టవలదు."

కపాలకుండల యీమాట లించుక బొమముడిపాటుతోఁ బలికెను. నవకుమారుఁ డింక నామె కేమియు నంతరాయము కలుగ జేయక "నడు. నేనును నీవెంట వచ్చెదను." అనెను.

కపాలకుండల సదర్పముగా "రండు, నేను దుశ్చరిత నగు

దునో కానో స్వయముగాఁ జూతురు. గాని, "రండు," అని పలికెను.

నవకుమారుఁ డింక నేమియు మాటలాడలేక నిట్టూర్పు విడిచి యామెచేయి వదలి తిరుగ నింటిలోనికిఁ బోయెను. ఆమె యొంటరిగా నరణ్యములోఁ బ్రవేశించెను.

౨

సప్తగ్రామమున కేభాగమున నడవి కలదో యిదివఱకే తెలిపి యుంటిమి. సాంద్రారణ్యము గ్రామమునకుఁ జాల సమీపము. కపాలకుండల యొంటరిగా నాకా డవియం దోషధిని వెదకఁ బోయెను. రాత్రి మనోహరముగ నుండెను. అంతయుఁ బ్రశాంతము. ఆవసంతయామినియం దంతరిక్షమున శశాంకుఁడు స్నిగ్ధజ్యోత్స్న వెదఁజల్లుచు ధవళమేఘమాలల నధఃకరించి పైకి వచ్చుచుండెను. పృథివిపై వన్యవృక్షములు లతలు మొదలైన వన్నియు నట్టె నిశ్శబ్దముగాఁ జల్లని వెన్నెలలో విశ్రాంతినొందుచుండెను. దట్టముగా నున్న చెట్లయాకులు చంద్రకిరణములను లోనికిఁ జొరనిచ్చుట లేదు. లతానికుంజములలో శ్వేతకుసుమములు రహస్యముగా వికసించుచుండెను. పశుపక్ష్యాదులు నీరవముగా నుండెను. ఎప్పుడైన విహంగములు ఱెక్కలు

విదర్చుట చేతను, నెచ్చటనైనఁ బండుటాకులు రాలుచుండుట చేతను, నెచ్చటనైన సర్పాదు లెండుటాకుల సందునఁ గదలు చుండుట చేతను గడు దవ్వున శునకములు మొఱుగుటచేతను, నా ప్రశాంతికి భంగము కలుగుచుండెను. వాయువు స్వచ్ఛందముగ వీఁచుటలేదు. శరీరమునకు హాయిని గలిగించు వసంతానిలము మాత్రము మెల్లమెల్లన వీఁచుచుండెను. దానివలనఁ జెట్లకొనలయాకులుమాత్ర మించుక కదలుచుండెను. పుడమి పఱకు బ్రాకిన నల్లనితీఁగెలు చలించుచుండెను. నీలాంబరమునఁ దెలిమబ్బు పింజలు మెల్లమెల్లనఁ గదలుచుండెను. కేవలమట్టి మందమారుతస్పర్శచేఁ బూర్వానుభూత మగు స్మృతి యస్పష్టముగా నామె హృదయమందు మెలఁగుచుండెను. వాలుకాస్తూప శిఖరమందుఁ దనదీర్ఘశిరోరుహములతో సాగర సలిలశీకరసంయుత మగు మలయానిలము క్రీడ సల్పిన సంగతి యామెకు జ్ఞప్తికి వచ్చెను. స్వచ్ఛనీలానంతనభోమండలము వంకఁ జూచి నంత నామెకుఁ దత్సదృశ మగు నపారపారావారము జ్ఞప్తికివచ్చెను. కపాలకుండల పూర్వస్మృతితో నన్యమనస్కయై పోవుచుండెను.

అందుచే నే యుద్దేశ్యముతో నెచటికిఁ బోవుచుండెనో యామె యాలోచింపలేదు. ఆమె పోవుమార్గము క్రమక్రమముగా నగమ్య మగుచుండెను. కాననము మఱింత దట్టమయ్యెను. శిరముపై నున్న వృక్షశాఖలు మఱింత దట్టమగుటచేఁ జంద్రకాంతిప్రసార మొక్కసారిగా నాగిపోయెను. ఇఁకఁ

త్రోవకూడ నామెకుఁ గనఁబడలేదు. అప్పుడు కపాలకుండల చింతామగ్నతనుండి వీడివడెను. అటు నిటుఁజూడ నామెకా యరణ్యములో వెలుతురు కాన వచ్చెను. లుత్ఫున్నీసాయు మొదట నా వెలుతురే చూచియుండెను. పూర్వాభ్యాసముచే కపాలకుండల కిట్టి సమయములందు భయము కలుగక పోఁగాఁ గుతూహలము కూడ జనించెను. మెల్లమెల్లగా నా వెలుతురు కానవచ్చిన వైపునకుఁ బోయి చూడ నామె కెవ్వరు గనఁబడలేదు. ఆప్రకాశమునకు సమీపముగాఁ బాడుపడిన యిల్లు కలదు. విపినము దట్టముగానుండుటచే నది మొదటఁ కనఁబడలేదు. అది యిటుకలతోఁ గట్టిన సామాన్యగృహము. ఆయింటిలోనుండి మనుష్యులసంభాషణమువినవచ్చుచుండెను. కపాలకుండల నిశ్శబ్దముగా నాగృహము సమీపించెను. ఇరువురు మనుష్యులు జాగరూకతతో సంభాషించుచున్నట్లామె గ్రహించెను. మాటలాడు విషయ మేమియు మొదట నామె తెలిసికొనలేక పోయెను. తరువాత భద్రముగా వినుటచే నామె కా మాట లిట్లు వినఁబడెను!

ఒకఁ డి ట్లనెను: "నా యభీష్టము మరణము. ఇది నీ కిష్టముకానియెడల నీకు నేను సాయము చేయను. నీవును నాకు సాహాయ్యము చేయవలదు."

రెండవవాఁ డి ట్లనెను. "నేనుగూడ శుభమునుగోరుట లేదు. శాశ్వతముగా నీమెను వెడలనడచినచో నాకు సమ్మతము, కాని హత్య చేయుట కంగీకరింపను. ప్రతికూలముగాఁ గూడఁ బ్రవర్తించెదను."

మొదటివాం డిట్లనెను: ,,నీవమాయకుండవు. అజ్ఞానివి. నీ కించుక జ్ఞానోపదేశము చేసెదను. అప్రమత్తుండవై వినుము. అతిరహస్య మగు వృత్తాంతము చెప్పెదను. మనుష్యశ్వాసము వినవచ్చుచున్న ట్లున్నది. నీవు బయటికిం బోయి నలుదెసలు చూచి రమ్ము."

నిజముగా కపాలకుండల వారి సంభాషణముం జక్కగా వినుటకై యా యింటిగోడచెంతకు వచ్చి నిలుచుండి యుండె ను. ఆతురముచేతను శంకచేతను నామెగట్టిగా నూపిరి విడచుచుండెను.

మొదటివాని యాజ్ఞానుసారముగా రెండవవాండు బయటికి వచ్చి కపాలకుండలను జూచెను. ఆ తేట వెన్నెలలో కపాలకుండలయు నా యాగంతుకుని జూచెను. కాని భయపడవలయునో సంతోషింప వలయునో యామెకుం దెలియలేదు. ఆ గంతుకుండు బ్రాహ్మణ వేషముతోనుండెను. ధోవతి కట్టుకొని యతండు శరీరమునిండ నుత్తరీయము కప్పుకొనియుండెను. బ్రాహ్మణకుమారుండు మిక్కిలి లేతవయసువాండు. ముఖమండల మందు వయశ్చిహ్నము లేమాత్రము కనుపించలేదు. ఆతని వదనముసుందరరమణీవదనమువలె నతి మనోహరముగ నుండెను. కాని రమణీదుర్లభ మగు తేజోగర్వము కూడ నాతని ముఖమున వ్యక్త మగుచుండెను. ఆతని శిరోజములు సామాన్యముగాం బురుషులవెండ్రుకలవలె క్షౌరసంస్కారమును బొందినటు లుండక స్త్రీల తలకట్టువలెం దలనిండం బెగిరియుండెను. ఉత్తరీయము కప్పుకొని యుండు

టచే నవి పిఱుందుల మీఁదను మూఁపులందును బాహువు లందును వక్షముమీఁదను వ్రాలి యుండెను. ఆతని లలాటము విశాలమై కొంచె మెత్తుగానుండెను. లలాటమధ్యమున రక్త నాళము ప్రకాశించుచుండెను. అతని నేత్రములందు విద్యు త్తేజము పరిఢవిల్లుచుండెను. అతని హస్తమందు విచ్చుకత్తి యుండెను. అతని సౌందర్యములో భీషణ భావము వ్యక్తమగు చుండెను.

బంగారమువంటి యాతని ముఖకాంతిలో నేదియో భయం కరమగు సంకల్పము సూచిత మగుచుండెను. ఆతఁ డాపాద మస్తకముపరిశీలించుచుండుటచే కపాలకుండల కించుక భయ ముకలిగెను. క్షణకాలము వారు పరస్పరము చూచుచు నిలు చుండిరి. మొట్టమొదట కపాలకుండల నేత్రపల్లవములు క్రిందికి వ్రాలెను. అంత నా యాగంతుకుఁడు "నీ వెవరు?" అని యామె నడిగెను. సంవత్సరమునకుఁ బూర్వము హిజలి గ్రామ ము చెంతనున్న పేరడవిలోనున్నపుడు కపాలకుండల యిట్టి ప్రశ్నలకు వెంటనే సరియైన సమాధానము చెప్పియుండును; కాని యిపుడు చాలవఱకు గృహిణీస్వభావ మలవడి యుండు టచే నామె తక్షణము బదులు పలుకలేక పోయెను. కపాల కుండల నిరుత్తర యగుట చూచి బ్రాహ్మణకుమారుఁడు, "కపాలకుండలా! ఇంత రాత్రివేళ నీ కాఱడవి కేల వచ్చి తివి" అని ప్రశ్నించెను.

అజ్ఞాతపురుషునినోట రాత్రివేళఁ దన పేరు వినుటచే కపాలకుండల యించుక నిస్తబ్ధయు భీతయు నయ్యెను. ఆమె నోటినుండి మాట బయటికి రాలేదు.

ఆ బ్రాహ్మణకుమారుఁడు మరల నిట్లనెను. "నీవు మా సంభాషణమును వింటివా?"

వెంటనే కపాలకుండలకు వాక్ఛక్తి కలిగెను. అడిగిన దానికి బదులు చెప్పక యామె నాతని నిట్లు ప్రశ్నించెను: 'నేనుగూడ నదే యడుగుచున్నాను. నిశీథమం దీ యడవిలో మీ రిరువురును దుర్మార్గాలోచనము చేయుచున్నారా?"

బ్రాహ్మణకుమారుఁ డించుకసేపు మాటలాడక చింతామగ్నుఁడై యుండెను. తనయిష్టసిద్ధి కేదియో నూతనోపాయ మాతని మనసునకుఁ దోఁచెను. అంత నతఁడు కపాలకుండల చేయిపట్టుకొని పాడుపడిన యాయింటినుండి యామె నావలికిఁ గొనిపోవసాగెను. కపాలకుండల మహాకోపముతోఁ దన చేయి వదలించుకొనెను. అంత నతఁడు "సంశయించెద వేల? నేను బురుషుఁడనుగాను" అని పలికెను.

కపాలకుండల మరల నచ్చెరు వందెను. విప్రకుమారుని మాటలయం దామెకుఁ బూర్ణ విశ్వాసము కలుగకున్నను నామె యాతనివెంట జనెను. రహస్య ప్రదేశము చేరి యా బ్రాహ్మణ వేషధారిణి కపాలకుండల చెవిలో "మేముచేయు దురాలోచనము వినెదవా? అది నీకు సంబంధించినదే" అని పలికెను. అత్యంతాతురముతో కపాలకుండల "వినెద"ననెను.

"అట్లయిన నేను వచ్చువఱకు నీవిచటనే వేచియుండుము" అని చెప్పి ఛద్మవేషిణి మరల నా జీర్ణగృహమునకుఁ బోయెను. కపాలకుండల కొంతతడవచటఁ గూర్చుండి యుండెను. కాని యామె చూచినదానిని బట్టియు వినినదానినిబట్టియు నామెకు భయము గలిగెను. ఇప్పు డొంటిగా గహనమం దంధ కారము లోఁ గూర్చుండియుండుటచే నామెకు ద్వేగము జనింపసాగెను. విశేషించి 'యా ఛద్మవేషిణి యామె నచటఁ గూర్చుండఁబెట్టి పోవుట కుద్దేశ్య మేమో? తన దురాలోచనసిద్ధికై తగుసమయ మని యామెనట నుంచిపోయి యుండవచ్చును. ఆఛద్మవేషిణి మరలి వచ్చుట కాలస్యమగుచు డెను. కపాలకుండల యిఁక నచటఁ గూర్చుండ లేక లేచి తన గృహమునకు బయలు దేఱెను.

అపు డాకాశమునఁ గాల మేఘములు గ్రమ్ముకొన నారంభించెను. అడవిలో నదివఱకున్న వెలుతురుకూడ నంతర్హిత మగుచుండెను. కపాలకుండల నిముషమైన నాలసింపక శీఘ్ర గమనముతో విపినాభ్యంతరమునుండి బయటికివచ్చుచుండెను. అప్పు డామె కెవ్వరిదో పాద ధ్వని వినఁబడెను. ఆమె వెనుకకుఁ దిరిగిచూచెను. ఆ కటికిచీఁకటిలో నామె కేమియు గనఁబడ లేదు. బ్రాహ్మణవేషధారిణి తన వెనుక వచ్చుచుండె నని యామె యనుకొనెను. అరణ్యముదాఁటి యామె చిట్టడవి లోనికి వచ్చెను. అచట నంత చీఁకటిలేదు. ఎదుట మనుష్యు లున్నఁగానఁబడుదురు. కాని యామె. కెవ్వరునుగనఁబడ లేదు.

అందుచే నామె త్వరితముగఁ బోవసాగెను. ఈసారి మనుష్య
పాదధ్వని స్పష్టముగా నామెకు వినఁబడెను. గగనము జీమూత
మాలతో మఱింత భీషణమగుచుండెను. కపాలకుండల యింక
ను ద్వరితముగ నడవఁదొడఁగెను. ఆమె తనగృహసమీపము
నకు వచ్చినదో లేదో భీషణ నినాదముతోఁ బ్రచండవృష్టి
ప్రారంభమయ్యెను! కపాలకుండల పరుగిడసాగెను. ఆమె వెనుక
వచ్చువాడును బరుగెత్తివచ్చుచున్న ట్లామెకుఁ దోఁచెను.
గృహము గోచరము కాకపూర్వమే యాప్రచండవృష్టిచే
నామె శిరము తడసి నీళ్ళు కాఱసాగెను. మేఘములు గర్జిల్లు
చుండెను. పిడుగులు పడునట్లుండెను. విద్యుల్లతలు మెఱయు
చుండెను. కుంభవృష్టి గురియుచుండెను. కపాలకుండల యెట్లో
యిల్లు చేరి ప్రాంగణము దాఁటి వసారాలోనికిఁ బోయెను.
ఆమె కొఱకు గృహద్వారము తెఱచియుండెను. తలుపు వేయు
టకై యామె వెనుకకుఁ దిరుగఁ బ్రాంగణమున దీర్ఘకాయుఁ
డొకఁడు నిలుచుండియున్న ట్లామెకుఁ గోచరించెను. అప్పుడు
పెద్దమెఱపు మెఱసెను. ఆవిద్యుత్కాంతిలో నామె యతనిని
గుర్తింపఁ గలిగెను. అతఁడు సాగరతీరవాసి యగు కాపా
లికుఁడు!

## 3

కపాలకుండల మెల్లమెల్లగాఁ దలుపులు బిగించి పడకటిగది
లోనికిఁ బోయి పట్టెమంచముపైఁ బరుండెను. మానవహృద

య మనంతమైన సముద్రము. దానిపై వాయువులు విజృంభించునపుడు తత్తరంగముల నెవఁడు లెక్కింపఁగలఁడు? కపాలకుండలా హృదయసాగరమున లేచు కల్లోలమాలల నెవఁడు గణింపఁగలఁడు?

ఆ రాత్రి హృదయవేదనచే నవకుమారుఁ డంతఃపురము నకుఁ బోలేదు. పడకటింటిలో కపాలకుండల యొక్కతె మాత్రమే పరుండెను. కాని యామెకు నిద్రపట్టలేదు. ప్రబల వాయుసంతాడితవారిధారాపరిసించితజటాజూటవేష్టిత మగు ముఖమండలమే యా గాఢాంధకారమునఁ జతుర్దిశల నామెకుఁ బ్రత్యక్షము కాసాగెను. ఆమె తన పూర్వ వృత్తాంతమంతయు నాలోచించి చూచుకొనఁ దొడఁగెను. కాపాలికుని యెడఁ దా నెట్లు ప్రవర్తించి లేచి వచ్చినదియు నామెకు స్మరణకు వచ్చెను.

కాపాలికుఁ డా నిబిడారణ్యమం దెట్టి పైశాచికకృత్యము లొనర్చినదియు నామెకు జ్ఞప్తికి వచ్చెను. ఆతఁ డొనర్చిన భైరవీపూజ, నవకుమారుని బంధనము మొదలయిన వన్నియు నామెకు స్ఫురింపసాగెను. కపాలకుండల యులికిపడెను. నేఁటి రాత్రి చూచిన సంగతు లన్నియు వరుసగా నామెకుఁ బొడ కట్టసాగెను. శ్యామసుందరి యోషధిని కోరుట, నవకుమా రుఁడు తనను నిషేధించుట, యతనియెడఁ దనకుఁ గలిగిన కోపము, తరువాత నరణ్యమందలి కౌముదీశోభ, పిదప నంధకారము, అచటఁ దాను చూచిన ఛద్మవేషిణీభీషణ

రమణీయరూపము మొదలగునవి యన్నియు నామె మనస్సు
నందుఁ బ్రతిఫలింపసాగెను.

పూర్వదిగంచలమున నుదయరాగము తోఁచునప్పటికి
కపాలకుండల కించుక నిద్రపట్టెను. ఆ యల్పనిద్రయం దామె
స్వప్నముగాంచెను. పూర్వము చెప్పిన సముద్రమునం దామె
నావయెక్కి పోవుచుండెను. నావ చాలనందమైనది. దానిపై
గాషాయ వర్ణముగల జెండా యెగురుచుండెను. కంఠములం
దుఁ బుష్పమాలలు ధరించి రాధాకృష్ణుల యనిర్వచనీయ
ప్రణయగీతములు పాడుచు నావికులు నావను నడపుచుండిరి.
పశ్చిమాంబరమునుండి లోకబాంధవుఁడు సువర్ణకాంతులు
వెదఁజల్లుచుండెను. బంగరు కాంతిలో సాగరము పకపకలాడు
చుండెను. ఆ హేమకాంతిలో మునిఁగి యాకాశమందలి
మేఘమాలలు మాటిమాటికిఁ దానమాడుచుండెను. ఆక
స్మికముగా రాత్రియయ్యెను. ద్యుమణి యెచటికో పోయెను.
పసిడిమబ్బు లెచటికో పోయినవి. గగనమున సాంద్ర జీమూత
మాల యావరించినది, ఇఁక సముద్రమున దిక్కులు తెలియ
లేదు. నావిలు నావను ద్రిప్పిరి. ఏవైపునకుఁ బోనీయ
వలయునో వారికిఁ దెలియలేదు. వారు సంగీత మాపి తమ
మెడలయందున్న పూలమాలలు త్రెంచి పాఱవైచిరి. కాషా
యపుజెండా తనంతట విఱిగి నీటిలోఁబడిపోయెను. పెనుగాలి
వీవ సాగెను. తాళప్రమాణము గల తరంగము లుద్భవింపఁ
దొడఁగెను. కల్లోలముల నడుమ జటాజూటధారి యగు దీక్ష

కాయుఁడొకఁడు నిలువఁబడి కపాలకుండల యున్న నావ నెడమ చేతితోఁ బట్టుకొని సంద్రములో ముంప నుద్యుక్తుఁ డగు చుండెను. అట్టియెడ భీషణరమణీయరూపిణియగు నా బ్రాహ్మణవేషధారిణి వచ్చి నావను బట్టుకొని "నిన్ను ముంపనా, తేల్పనా?" అని యామె నడిగెను. తటాలున కపాలకుండల నోటివెంట, "ముంచుము" అనుమాట బయటికి వచ్చెను. బ్రాహ్మణివేషధారిణి నావను వదలి పెట్టెను. తరువాత నావ కూడ మాటలాడసాగెను. "నే నింక నీభారము మోయలేను. నేను పాతాళమునకుఁ బోవుచున్నాను!" అని పలుకుచు నావ మునిఁగిపోయెను.

కపాలకుండల మెయినిండఁజెమ్మటగ్రమ్మ స్వప్నమునుండి మేల్కాంచి కనులు తెఱచి చూడఁ బ్రభాత మగుచుండెను. గవాక్షము తెఱచి యుండెను. అందుండివసంతవాయువు లోనఁ బ్రవేశించుచుండెను. మెల్లగాఁ గదలుచున్న వృక్షశాఖలపై శకుంతసంతానములు కూజించుచుండెను. గవాక్షముపై మనోహరములగు విపినలతలు పరిమళించు పుష్పములతో వ్రేలాడుచుండెను. కపాలకుండల స్త్రీస్వభావముచే నా లతలను బట్టుకొని లాగసాగెను. గవాక్షమునకుఁ బెనవేయబడిన యా లతలలో నుండి యుత్తరమొకటి క్రిందఁబడెను. కపాలకుండల దాని నిట్లు చదువుకొనెను,

"నేఁడు సాయంకాలమైన తరువాతఁ గడచినరాత్రి నీతో మాటలాడిన బ్రాహ్మణకుమారుని గలిసికొనుము. నీకుసంబం

ధించిన యత్యంతోపయుక్తములగు నేవిషయములు వినఁ గోరితివో వానిని వినవచ్చును.—బ్రాహ్మణవేషధారి.

## ౪

కపాలకుండల యానాఁడుసాయంకాలమువఱకు నన్యాలోచనము వదలి కేవల మాబ్రాహ్మణ వేషధారికడకుఁ బోవుట యుచితమా కాదా యని విచారించుచుండెను. రాత్రివేళ నిర్జన ప్రదేశమం దపరిచితుఁ డగు పురుషునితోఁగలసి మాటలాడుట పతివ్రత యగు యువతి కనుచిత మను సంశయ మామెకుఁ గలుగలేదు. దర్శనోద్దేశ్యము దూష్యము కాదేని దర్శించుట కూడ దూష్యము కాదనియు, బురుషులు పురుషులతోడను స్త్రీలు స్త్రీలతోడను, గలిసి మాటలాడుట కధికార ముండినట్లు స్త్రీపురుషులు కలసి సంభాషించుకొనుటకుఁగూడ నధికారము కలదనియు నామె యుద్దేశ్యము. విశేషించి యా బ్రాహ్మణవేషధారి పురుషుఁడు కాఁడేమో! అయ్యిన నా సందేహ మిప్పు డనావశ్యకము. కాని యాతని దర్శించుట శ్రేయస్కర మగునో కాదో యని యామెయింత దూర మాలోచించుచుండెను.

ప్రప్రథమమున నాబ్రాహ్మణవేషధారితోడ సంభాషణము, తరువాతఁ గాపాలికుని దర్శనము, పిదప స్వప్నము. ఈకారణములచేఁ గపాలకుండలతనకమంగళము సమీపించుచున్నదని

కడుంగడు సంశయించుచుండెను. ఈయమంగళశంకకునుగాపా
లికుని యాగమనమునకును సంబంధ ముండవచ్చుననియామె
కుఁ దోఁచుచుండెను. బ్రాహ్మవేషధారి కాపాలికుని సహచరు
డనియు నందుచే నతనికడకుఁ బోయిన సంశయవిషయాభూత
మగు నీచెడుగువాటిల్లవచ్చుననియు నామె భావించుచుండెను.
వారిదురాలోచనముకూడఁదనవిషయమేయని బ్రాహ్మణవేష
ధారి స్పష్టముగాఁ జెప్పియుండెను. కాని యిప్పు డతనికడకుఁ
బోవుటవలన నా యశుభము నివారణ మైనను గావచ్చును.

బ్రాహ్మణవేషధారి రహస్యముగా నింకొక వ్యక్తితో
నాలోచించుచుండెను. ఆ వ్యక్తి కాపాలికుఁడు కావచ్చును.
ఎవరికో మరణముగాని లేకున్న శాశ్వతవియోగమయినఁ
గాని కల్పింపవలె నను సంకల్పము వారి సంభాషణమువలన
వ్యక్తమైనది. ఆ సంకల్ప మెవరిని గుఱించి? బ్రాహ్మణవేష
ధారి యది తనను గుఱించియే యని స్పష్టముగాఁ దెలిపి
నాఁడు. అందుచేఁ దనకే మరణమో లేక శాశ్వత వియో
గమో కలుగునని యామె తలఁచెను. కావచ్చును. అటు
పిమ్మట స్వప్నము. ఆ స్వప్నము తాత్పర్యమేమి ? మహావిప
త్సమయమందు బ్రాహ్మణవేషధారి తనను రక్షింపఁగోరి
వచ్చితి నని స్వప్నమందుఁ జెప్పినాఁడు. ప్రత్యక్షమందుఁగూడ
నట్లె జరుగుచున్నది. అతఁ డీవృత్తాంతము నంతయుఁ జెప్పఁ
దలఁచియుండెను

తాను స్వప్నమందు "నావను ముంచు" మని చెప్పినది.
ప్రత్యక్షమందుఁ గూడ నటె చెప్పవలయునా! కాదు, కాదు

భక్తవత్సల యగు భవానీదేవి తనపై ననుగ్రహముచే నిట్లు స్వప్నమందుపదేశించినది. బ్రాహ్మణవేషధారియువచ్చితన్నుద్ధరింతునని చెప్పినాఁడు అతని సాయ మక్కఱలేదనినఁ దాను మునిఁగిపోవలసి వచ్చును. అందుచే కపాలకుండల యతనిని జూడఁ బోవ నిశ్చయించుకొనెను.

వివేకము గలవాఁ డిట్లు నిశ్చయించుకొనునా ? యనునది సందేహాస్పదము. కాని వాని నిశ్చయముతో నిచట సంబంధములేదు. కపాలకుండల యెక్కువ వివేకము కలది కాదు. అందుచే నామె విజ్ఞులవలె నిశ్చయించుకొనలేదు. కుతూహలపరవశురాలగు రమణివలెనుఁ భీషణరమణీయరూపదర్శనలోలుప యగు యువతివలెను, నిశాసమయమున నరణ్యసంచారశీల యగు సన్న్యాసిపాలితవలెను, భవానీభక్తిభావసమ్మోహితవలెను, నుజ్జ్వలద్వహ్నిశిఖాపతనోన్ముఖపతంగమువలెను నామె నిశ్చయించుకొనినది.

సాయంకాలమైనతరువాత గృహకృత్యము లన్నియు నిర్వర్తించుకొని కపాలకుండల పూర్వమువలె నరణ్యమునకుఁ బయనమయ్యెను. పోవునపు డామె తన శయనాగారమందలి దీపము దగ్గించిపోయెను. ఆమె పడకగదినుండి బయటికి వచ్చెనో లేదో దీప మాఱిపోయినది.

బయలు దేఱునపు డామె యొకసంగతి మఱచినది. బ్రాహ్మణవేషధారి యెచటికి రమ్మనివ్రాసియుండెనో తెలిసికొనుటకై మరల నామె యుత్తరము చదువుకొనవలసి వచ్చెను.

అందుచే నామె మరల లోనికి వచ్చి తా నుదయ ముత్తరము దాచినచోట వెదక నది కనఁబడలేదు. తల దువ్వుకొనునపు డా యుత్తరము కొప్పులోఁబెట్టుకొన్న సంగతి యామెకు జ్ఞప్తికి వచ్చెను. అందుచే నామె వ్రేలితోఁ దన కొప్పులో వెదకి కొనెను. ఉత్తరము వ్రేలికిఁదగులక పోఁగాఁ గొప్పువీడి వెండ్రు కలు విడియఁబడెను. అప్పైనను నుత్తరము కనఁబడలేదు. అంత నామె యింటిలో నచ్చటచ్చట వెదకెను. ఎచటను గనఁబడలేదు. చివర కామె వెనుకటిప్రదేశముననే యాతనిని గలిసికొనవచ్చు నని నిశ్చయించుకొని మరల బయలుదేఱెను. అవకాశము లేకపోవుటచే విడియఁబడిన శిరోరుహముల నామె మరల ముడివేసికొన లేకపోయెను. అందుచే నామె యవివాహితగా నున్నకాలమునందువలె నేఁడును, దల విడి యఁ బోసికొనియే పోవుచుండెను.

౫

కపాలకుండల గృహకార్య నిర్వహణమందు వ్యాపృతమై యుండ సాయంకాలమునకుఁ బూర్వమే యా లేఖ యామె కొప్పునుండి క్రిందఁ బడిపోయినది. దాని నామె తెలిసికొన లేదు. నవకుమారుఁడు దానిని జూచెను. ఆమె కొప్పునుండి లేఖ క్రిందఁ బడుట కాతఁ డాశ్చర్యపడెను. ఆమె వేఱొక పనిమీఁదఁ బోయినంత నతఁ డాలేఖను బయటికిఁ గొనిపోయి

చదువుకొనెను. దానిని జదివినవారి కెల్లరకు నొకటే యభి
ప్రాయము కలుగును. "నిన్నటిరాత్రి దేనిని వినఁగోరితివో
యాసంగతి వినెదవా?" ఆ సంగతి యేమి? ప్రణయ విష
యమా? ఆ బ్రాహ్మణవేషధారి మృణ్మయి కుపపతియా?
కడచినరాత్రి వృత్తాంతము తెలియనివానికిఁక రెండవ యాలో
చనము పోదు.

పతివ్రత భర్తృసమాగమనకాలమందుగాని యన్యకారణము
చేతఁగాని చితి నెక్కినపుడు దాని కంటించిన యగ్నిచే
మొట్ట మొదట ధూమరాశి బయలు వెడలి నలుదెసలఁ జుట్టు
కొని దృష్టిని బోఁగొట్టి యంధకారమయము చేయును. క్రమ
ముగాఁ గాష్ఠము లంటుకొని మండుచుఁ గ్రిందినుండి సర్పజిహ్వ
లవలె నొకటిరెం డగ్నిశిఖలు లేఁగి శరీరమునం దచ్చటచ్చటఁ
గాటువేయును. తరువాత భగభగ మను శబ్దముతో వహ్ని
జ్వాలలు నలుదిక్కులఁ జెలరేఁగి యావరించి ప్రత్యంగమును
గాల్చును. అటుపిమ్మటఁ బ్రచండధ్వానముతో వైశ్వానర
కీలలు నభోమండలమున కెగసి మస్తకమునుగూడ దహించును.
లేఖ చదువుకొన్న నవకుమారుని కట్లెయయ్యెను. మొదట
నాతని కేమియుఁ దెలియలేదు. తరువాత సంశయము, అటుపై
నిశ్చయము, చివరకు జ్వాల! క్లేశాధిక్యమునుగాని సుఖాధి
క్యమునుగాని మనుష్యహృదయ మొక్కసారి సహింప
లేదు. ధూమరాశి మొదట నవకుమారుని గ్రమ్ముకొనెను.
పిదప వహ్నిజ్వాల లాతని హృదయమును దహింపఁజేసినవి.

చివర కగ్నికీలలచే నతనిహృదయము భస్మీభూతము కాసాగెను. కపాలకుండల కొన్నికొన్ని విషయములలోఁ దనమాట నతిక్రమించుచున్న దని పూర్వమే యతనికిఁ దెలియును. విశేషించి యిప్పు డతఁడు నిషేధించినను దన కిష్టమైనచోటికామె యొంటరిగాఁ బోవుచున్నది. ఎవరితోడనో యథేచ్ఛముగా నామె సంచరించుచున్నది. అదియును గాక యిపు డామె తన యాజ్ఞను దిరస్కరించి నిశీథమం దరణ్యములో నేకాకినియై పరిభ్రమింపఁ బోయినది. ఇట్టి ప్రవర్తన మెవరు సంశయింపకుందురు ? కాని నవకుమారుని హృదయములో నామెయెడ నట్టి సంశయ ముద్భవించెనేనిఁ దన కనివార్య మగు వృశ్చికదంశన బాధ కలుగునని యెఱిఁగి యాతఁ డొక్కదినమైననట్టి సంశయమునకుఁ దావీయలేదు. నేఁడును నతఁడు సంశయించుటలేదు. కాని సందేహమున కవకాశము పోయి ప్రత్యక్షప్రమాణము దొరకినది.

ప్రథమోద్వేగము శమించిన తరువాత నవకుమారుఁడు నిర్విణ్ణుఁడై కూర్చుండి చాలసేపు విలపించెను. తరువాత నతనికించుక స్థిమితము కలిగెను. అంత నతఁడు కర్తవ్యమున స్థిరప్రతిజ్ఞుఁ డయ్యెను. నేఁ డతఁడు కపాలకుండలతో నేమియుఁ బలుకలేదు. చీఁకటిపడిన తరువాత కపాలకుండల విపినమునకు బయలుదేఱగానే తాను వెంటఁబోయి యామె యొనరించు మహాపాపమును బ్రత్యక్షముగాఁ జూచి తరువాతఁ బ్రాణములు విసర్జింపవలె నని యాతఁ డనుకొనెను. అందుచే నతఁడు

కపాలకుండలతో నేమియుఁ బలుకలేదు. ప్రాణములు విడువవలయును. కాకున్న నతఁ డేమి చేయవలయును? దుర్భరమగు నీ జీవనభారమును మోయ నతనికి శక్తి చాలదు.

ఇట్లు నిశ్చయించుకొని కపాలకుండల బహిర్గమనమునకై ప్రతీక్షించుచు దొడ్డివాకిలివంక నతఁడు దృష్టినిల్పియుండెను. కపాలకుండల బయలు వెడలి కొంచముదూరము పోయినంత నవకుమారుడును బయనమయ్యెను. ఆసమయమున కపాలకుండల తిరిగి వచ్చెను. అది చూచి యతఁడును దాగియుండెను. చివర కామె మరల బయటికి వచ్చి కొండెము దూరము పోయినంత నతఁడును మరల నామె ననుసరింప బయలుదేఱెను. అట్టియెడ ద్వారమున కడ్డముగా నిలుచున్న దీర్ఘకాయుఁ డొకఁ డతని కెదురయ్యెను.

అతఁ డెవరో యెందులకు వచ్చెనో తెలిసికొన నవకుమారుని కిచ్ఛజనింపలేదు. చూచుచున్నను నవకుమారున కతఁడు కనఁబడలేదు. కేవలము కపాలకుండల మీఁదనే దృష్టి నిల్పియాతఁడు వ్యగ్రుఁడయి యుండెను. అందుచే నవకుమారుఁడు తనత్రోవ కడ్డముగా నున్నవానిని ద్రొమ్ముపై గుద్ది యావలకుఁ ద్రోసెను. కాని యతఁడావ్యక్తినిగదలింపలేకపోయెను.

"ఎవరు నీవు? ఆవలికిఁ బొమ్ము. నా కడ్డము లెమ్ము!" అని నవకుమారుఁ డనెను.

'నే నెవరో నీవు గుర్తింపలేదా?"

"ఆవ్యక్తి వాక్యములు సముద్రగర్జనమువలె నాతని చెవిఁ

బడెను. నవకుమారుఁడు పరిశీలించి చూచి యావ్యక్తి తానిది వఱలోఁ జూచిన జటాజూటధారియగు కాపాలికుఁడని తెలిసికొనెను.

నవకుమారుఁ డులికిపడెను, కాని భయపడలేదు. వెంటనే వదనము ప్రఫుల్లము కాఁగా నతఁ డిట్లనెను. "కపాలకుండల మిమ్ము దర్శింప వచ్చుచున్నదా?"

"లేదు."

మినుకు మినుకు మనుచున్న యతని యాశాప్రదీప మాఱిపోయినట్లు వదనము మేఘమువలె నల్లబడిపోవ నతఁడు "అట్లయిన మీరు నా త్రోవ కడ్డము లెండు" అని పలికెను.

"త్రోవ కడ్డము లేచెదను. కాని నీతోఁ గొన్నిమాటలు చెప్పవలసియున్నది. ముందు వినుము."

"నాతో మీ కేమిమాటలున్నవి? మీరు మరల నాప్రాణములు తీయుటకు వచ్చితిరా? అట్లయిన నా ప్రాణములు కొనుఁడు. ఇప్పుడు మి మ్మేమియు ఆటంకపెట్టను. మీ రిచటనే వేచియుండుఁడు. నేను త్వరలో వచ్చెదను. దేవతాపరితుష్టికొఱకేల నాశరీరము సమర్పింపరాదు. ఇప్పుడే యాపుణ్యము సంపాదించుకొందును ఎవతె నాప్రాణములు కాపాడినదో యామెయే నాకు హాని చేసినది. కాపాలికా, యీసారి నామాటలు నమ్ముఁడు. నే నిప్పుడే తిరిగివచ్చి యాత్మసమర్పణము గావించుకొందును."

"నే నిప్పుడు నిన్ను వధింప రాలేదు. భవానీదేవి కట్టి

యిచ్ఛ లేదు. నేను జేయవచ్చిన పనికి నీవును సమ్మతించెదవనుకొందును. ఇంటిలోనికి రమ్ము, వినిపించెదను."

"ఇప్పుడు కాదు. తరువాత విందును. మీరిచటనే వేచి యుండుఁడు. నాకవసరమైన పని యున్నది. పని చేసికొని వచ్చెదను."

"వత్సా, నే నంతయు నెఱుఁగుదును. నీ వాపాపిష్ఠురాలి వెంటఁ బోవుచున్నావు. ఆమె యెక్కడికిఁ బోవుచున్నదో నే నెఱుఁగుదును. నిన్ను నే నాచోటికి వెంటఁబెట్టుకొని పోవుదును. నీవు దేనినిజూడఁగోరుచున్నావో దానిని జూపించెదను. ఇపుడు నా మాట వినుము. ఎంతమాత్రము భయపడకుము."

"ఇఁక మీవలన నా కేమియు భయము లేదు. రండు."

నవకుమారుడు కాపాలికు నింటిలోనికిఁ గొనిపోయి యాసనముపైఁ గూర్చుండఁబెట్టి తానొక యాసనముపైఁ గూర్చుండి "చెప్పుఁడు" అనెను.

౬

కాపాలికుఁ డాసనముపైఁ గూర్చుండి తన చేతులుచాపెను. అవి విఱిగిపోయి యుండుట నవకుమారుఁడు గ్రహించెను.

ఏరాత్రి కపాలకుండలతో నవకుమారుఁడు సముద్రతీరమునఁ బలాయితుఁడయ్యెనో యారాత్రి వారల నిరువుర వెదకుచుఁ బోయి కాపాలికుఁడు సైకతస్తూపశిఖర మెక్కి

యది విఱిగిపడ దానితోఁ గ్రిందఁ బడెను క్రిందఁ బడునపు డతఁడు చేతులను మోపి శరీరమునకు దెబ్బతగులకుండ రక్షించుకొనఁ బ్రయత్నించెను. కాని యతని హస్తములు విఱిగి పోయినవి. ఆవృత్తాంత మంతయు నతఁడు నవకుమారునకు సవిస్తరముగాఁ జెప్పి యిట్లనెను. "కరములతో నిత్యక్రియలు నిర్వర్తించుట కంత కష్టము లేదు. బలములేని యీ భగ్న హస్తములతోఁ గాష్ఠములు కొనివచ్చుట కష్టముకదా!

"భూమిపైఁ బడినంతనే చేతులు మాత్రము విఱిగి పోయినవి. మిగిలిన యవయవములకు హాని కలుగలే దని నాకు వెంటనే తెలియలేదు. క్రిందఁ బడిపోయినంతనే మూర్ఛపోతిని. మొట్టమొదట సంపూర్ణముగా నజ్ఞానావస్థయందుంటిని. తరువాతఁ గొంచెము తడవునకు దెలివి వచ్చినది. మరల నించుకతడ వొడ లెఱుఁగకుంటిని. నే నెంతసే పట్టి యవస్థలో నుంటినో చెప్పలేను. ఒక పగలును రెండు రాత్రులును గడచిన వనుకొనెదను. మూఁడవనాఁటి ప్రాతఃకాలమున నాకుఁ బూర్ణముగాఁ దెలివి వచ్చినది. తెలివి రాకముందు నేను గలఁ గంటిని. అందు భవానీదేవి——" ఇట్లు చెప్పుచుండ గాపాలికుని శరీరము రోమాంచిత మయ్యెను.

"అందు భవానీదేవి బొమలు ముడివైచి నన్నుఁ గొట్టినది. కొట్టి, 'ఓరి దురాచారా! నీమనస్సులో మాలిన్యముండుటచే నా పూజకు విఘ్నము కలిగినది. నీ వింతవఱ కింద్రియ లాలసుఁడవై యీకుమారి రక్తముతో నన్నుఁ బూజింపకుంటివి.

కావున నీకుమారివలననే నీ పూర్వకృత పుణ్యమంతయు నశించినది. నే నిఁక నీ కడ నెప్పుడును బూజలు గ్రహింపను!' అని పలికినది. నే నపుడు విలపించుచు జగజ్జనని చరణములపై వ్రాలితిని. అప్పు డా తల్లి ప్రసన్నురాలై, "కుమారా, దీని కొక్కటియే ప్రాయశ్చిత్తము కలదు. ఆ కపాలకుండలను నాకు బలియిమ్ము. ఎంతకాలము దానిని బలి యీయవో యంతకాలము నన్నుఁ బూజింపవలదు." అని చెప్పినది.

"ఈ ప్రకారముగా నెన్నిదినములకు నాకారోగ్యము కలిగినదో యిపుడు వర్ణించుటవలనఁ బ్రయోజనము లేదు. ఆరోగ్యము కలిగిన తరువాత దేవియాజ్ఞను బాలించుట కుపక్రమించితిని. కాని యీ నా చేతులందు శిశువుల కున్నంత బలమైనను లేదు. బాహుబలము లేకున్న యత్నము సఫలము కాదు గదా! అందుచే నీ ప్రయత్నమునం దింకొకరిసాహాయ్యమావశ్యకమైనది. కాని యిప్పటి జనులకు ధర్మమునందాసక్తి తక్కువ. విశేషించి కలిప్రాబల్యముచేతను యవనుఁడు రాజగుటవలనను బాపాత్మకమగు రాజశాసనభయముచే నెవ్వరు నిట్టి కార్యమునందు నాకుఁ దోడ్పడరైరి. బహుకాలము వెదకివెదకి యీ పాపిష్ఠురాలి నివాసము కనుఁగొంటిని. అయినను బాహువులందు బలము లేకుండుటచే భవానీదేవి యాజ్ఞను బరిపాలింప లేకుంటిని. కేవలము మనస్సిద్ధికై తంత్రానుసారముగాఁ గ్రియాకలాపము నిర్వర్తించుచుంటిని. కడచినరాత్రి చెంతనున్న విపినమందు హోమ మొనర్చుచుంటిని. అప్పుడు కపాలకుండల యొకా-నొక బ్రాహ్మణ

కుమారునితోఁ గలిసి మాటలాడుచుండుట స్వయముగాఁ జూచితిని. నేఁడును నామె యాతనికడకుఁ బోవుచున్నది. చూడఁదలఁచితివేని నావెంటరమ్ము, చూపించెదను.

"వత్సా, కపాలకుండల వధ్యురాలు. నేను భవానీదేవి యానతి ననుసరించి యామెను వధించెదను. ఆమె నీకవిశ్వాసిని యయ్యెను. కావున నీకును నామె వధ్యురాలు అందుచే నీవు నాకీ సాయము చేయుము. ఈ దుర్మార్గురాలిని బట్టుకొని యజ్ఞప్రదేశమునకుఁ గొనితెమ్ము. అచట నామెను నీచేతులతో బలియిమ్ము. ఇందువలనఁ బరమేశ్వరి నీ వొనర్చిన యపరాధమును క్షమించును. ఇట్టి పవిత్రకార్య మొనర్చిన నీ కక్షయమైన పుణ్యము కలుగును. ఆ యవినీతురాలిని శిక్షించిన ట్లగును. పగతీర్చికొన్న ట్లగును."

కాపాలికుఁడు తాను చెప్పనది ముగించెను. నవకుమారుఁడేమియు బదులు పలుకలేదు. అతఁడు నిశ్శబ్దముగా నుండుట జూచి కాపాలికుఁడు "కుమారా, ఇప్పుడు నీకుఁ జూపించెదనన్న దానిని జూపింతును, రమ్ము!" అనెను.

నవకుమారుఁడు మెయినిండఁ జెమ్మటగ్రమ్మఁ గాపాలికుని వెంటఁ జనెను.

## ౨

కపాలకుండల గృహమునుండి బయలుదేఱి యడవిలోఁబోయి మొట్టమొదటఁ బాడుపడినయిల్లు చేరెను: చేరి యచట

బ్రాహ్మణకుమారునిఁ జూచెను. అది పగలైనచో నామెముఖ
కాంతి మిక్కిలి మ్లానముగఁ గనఁబడి యుండెడిది. బ్రాహ్మణ
వేషధారి కపాలకుండలతో నిట్లనెను: "ఇచటికిఁ గాపాలి
కుఁడు రాఁగలఁడు. ఏమియు నిచట మాటలాడుట యుక్తము
కాదు. ఇంకొకచోటికిఁ బోదము, రమ్ము." అరణ్యములో
నించుక విశాలమైన ప్రదేశ మొకటి కలదు. దానికి నలు
ప్రక్కల వృక్షములు కలవు. నడుమ ఖాళీచోటున్నది.
అందుండి బయటికిఁ బోవు మార్గ మొకటి కలదు. బ్రాహ్మణ
వేషధారి కపాలకుండల నచటికిఁ దీసికొనిపోయెను. ఇరువు
రును గూర్చుండిన తరువాత బ్రాహ్మణవేషధారి యిట్లనెను:
"మొదట నే నెవరో చెప్పెదను. తరువాత నామాట లెంత
వఱకు నమ్మఁదగినవో నీవే విచారించుకొనవచ్చును. నీవు
భర్తతో హిజలీనుండి వచ్చునపుడు మార్గములో రాత్రివేళ
నొక యవనయువతిని జూచితివి. నీకు జ్ఞప్తియున్నదా?"

"ఎవరు ? నా కాభరణము లిచ్చినయామెయా?"

"ఆమెయే నేను."

కపాలకుండల మిక్కిలి యాశ్చర్యపడెను. ఆమె విస్మిత
యగుటఁ జూచి లుత్ఫున్నీసా యిట్లనెను. "ఇంకను నాశ్చర్య
పడఁ దగిన విషయ మున్నది. నీకు నేను సవతిని."

కపాలకుండల యులికిపడి, "అదెట్లు?" అని ప్రశ్న చేసెను.
లుత్ఫున్నీసా యపుడు తన పూర్వవృత్తాంతము చెప్ప

నారంభించెను. వివాహము, జాతిభ్రంశము, భర్తృత్యాగము, ఢాకాకుఁ బోవుట, ఆగ్రాయందు నివాసము, జహాంగీరుతోడి సంబంధము, మెహెరున్నిసాతోడి సంభాషణము, ఆగ్రాపరిత్యాగము, సప్తగ్రామ నివాసము, నవకుమారుని దర్శనము, అతని వ్యవహారము, కడచినరాత్రి మాఱువేషముతో నరణ్యప్రవేశము, హోతృదర్శనము మొదలగున వన్నియుఁ జెప్పెను. ఈ సమయమున కపాలకుండల, "నీ వే యభిప్రాయముతో మా యింటికి మాఱువేసముతో వచ్చితివి?" అని యామె నడిగెను.

"నీకును నీ భర్తకును శాశ్వతవియోగము గల్పించు నభిప్రాయముతో వచ్చియుంటిని."

కపాలకుండల యించుక యాలోచించి, "దాని నెట్లు నెఱవేర్పఁగలవు?" అని ప్రశ్నించెను.

"ప్రస్తుతము ప్రాణేశ్వరునకు నీ పాతివ్రత్యవిషయమున సంశయము కల్పించితిని. కాని దాని వలన నీకుఁ బ్రయోజన మేమి ? ఆమార్గము వదలితిని. ఇపుడు నేను జెప్పిన ప్రకారము చేయుదు వేని నా కోరిక ఫలించును. నీకు శుభము కూడఁ గలుఁగును."

"హోతనోట నీ వెవరి పేరు వినియుంటివి?"

"నీ పేరే. అతఁడు నీకు శుభమో యశుభమో కలిగించుటకు హోమము చేయుచున్నాఁడు: దానిని దెలిసికొనుటకే నే నాయనకు నమస్కరించి చెంతఁ గూర్చుంటిని. హోమ

కార్యము పూర్తి యగువఱకు నే నచ్చటె కూర్చుంటిని. హోమాంతమందు నీనామముతోఁ గూడిన యాహుతి కభిప్రాయ మేమని చమత్కారముగా నడిగితిని. కొంతసేపాయనతో సంభాషింప నీకమంగళ మొనర్చు కోర్కెతో నాతఁడు హోమము చేయుచున్నాఁ డని తెలిసికొంటిని. నాకోర్కెయు నదియేయని యాయనకుఁ జెప్పితిని. "వెంటనే పరస్పర సాహాయ్య మావశ్యకమైనది. అపుడు సవిస్తరముగా నాలోచించుటకుఁ బాడుపడిన యింటి లోనికిఁ దీసికొని పోయి యచటఁ దన మనోగతమును వ్యక్తపఱచినాఁడు. నీ మరణమే యాయన యభీష్టము. అందుకు నేను సమ్మతింప లేదు. నే నీజన్మమున నెన్నో పాపకార్యము లొనరించితిని కాని యేపాప మెఱుఁగని యువతిని జంపించు నంతటి మహాపాపమున కొడిగట్టునంత యధఃపతితను గాలేదు. అది నాకిష్టము లేదని చెప్పితిని. ఆ సమయమున నీ వచటికి వచ్చియుంటివి. నీవుఁ గూడఁ గొంచెము వినియుందువని తలఁచెదను."

"నేను నిట్టి వితర్కమును వింటిని."

"నన్నాయన మూఢురాలినిగా నెంచి నాకించుక యుపదేశింపఁ గోరెను, చివర కేమి తేలునో తెలిసికొని వచ్చి నీకు మంచివార్త తెలుపవలయు నని నిన్నీయరణ్యమున నుండు మని చెప్పి పోతిని."

"తరువాత మరల రాలే దేమి?"

"ఆయన యేవో చాల సంగతులు చెప్పినాఁడు. అందుచే

నాలస్యమైనది. నీ వాయనను బాగుగా నెఱుఁదువా?"

"ఆయన నన్నిదివరకుఁ బోషించిన కాపాలికుఁడు."

"నిజమే! కాపాలికుఁడు నిన్ను సముద్రతీరమునఁ గనుఁగొనుట, నవకుమారుని రాక, యతనితో నీ పలాయనము మొదలైన వన్నియుఁ జెప్పినాఁడు. నీ పలాయనము తరువాతనే మేమి జరిగెనో యవి యన్నియు విస్తరించి చెప్పినాఁడు. అవన్నియు నీకు విశదముగాఁ దెల్పెదను."

అంత లుత్ఫున్నీసా కాపాలికుఁ డిసుకకొండనుండి పడుట, చేతులు విఱుగుట యాతని స్వప్నము మొదలగునవి యన్నియుఁ జెప్పెను. స్వప్నవృత్తాంతము విని కపాలకుండల యదరిపడెను. ఆమె మనస్సులో మెఱపులు మెఱసెను. లుత్ఫున్నీసా మరల నిట్లనెను: "కాపాలికుఁడు భవానీదేవి యాజ్ఞను బరిపాలించుటకు దృఢప్రతిజ్ఞ చేసియున్నాఁడు. బాహువులు బలహీనము లగుటవలన నాతని కితరుల తోడ్పాటు మిక్కిలి యవసరము. నన్ను బ్రాహ్మణకుమారునిగా నెంచి తన కుపకారము చేయుదునను నాశతో నాకీవృత్తాంత మంతయుఁ జెప్పినాఁడు. నే నింతవఱకు నట్టి దుష్కర్మమున కంగీకరింపలేదు. ఈదుర్మార్గురాలి దుశ్చింతలు చెప్ప నలవికావు. కాని యిట్టిపని కెప్పుడు నొప్పుకొన దని గట్టిగాఁ జెప్పఁగలను. అదియునుగాక యేతత్సంకల్పమునకు విరుద్ధముగా నడువవలయునని నాయభిప్రాయము. ఈయభిప్రాయముతోడనే నేను నిన్ను గలిసికొంటిని. కాని యీకార్య మత్యంతము స్వార్థపరు

రాలనై చేయుచున్నాను. నీకుఁ బ్రాణదాన మొనర్తును. నా కొకింత సాయము చేయుము!"

"ఏమి చేయవలెను?"

"నాకును బ్రాణదానము చేయవలెను. నీభర్తను బరిత్యజింపుము."

కపాలకుండల చాలసేపు మాటలాడ లేదు. తరువాత నామె, "ప్రాణేశ్వరుని వదలిపెట్టి యెచటికిఁ బోవుదును?" అనెను.

"విదేశమునకు—బహుదూరదేశమునకుఁ బొమ్ము, నీకు మేడ లిచ్చెదను, ధనాదు లిచ్చెదను, దాసీదాసము నిచ్చెదను. నీవు రాణివలె నుండవచ్చును."

కపాలకుండల మరల నాలోచింప నారంభించెను. ఒక్కసారి ప్రపంచమంతయు నామెకన్నులయెదుటఁ గనఁబడెను. అం దెవ్వరును గనఁబడలేదు. అంతఃకరణమును బరీక్షించి చూచెను. అందు నవకుమారుఁడు కనఁబడలేదు. ఇఁక లుత్ఫున్నీసా సుఖమార్గము నిరోధింప నేల? అంత నామె లుత్ఫున్నీసాతో నిట్లనెను: "నీవు నా కుపకారము చేయుచున్నావో లేదో తెలిసికొన లేకున్నాను. మేడలు, నైశ్వర్యము, దాసదాసీజనము మొదలగు నవి యన్నియు నా కక్కఱలేదు. నీ సుఖమార్గము నే నేల యడ్డుపఱచవలెను? నీకోర్కె సఫలమగుఁ గాక! ఇప్పటినుండి యీవిఘ్నకారిణివార్త నీకుఁ దెలియదు. నే నిదివఱ కరణ్యమునఁ జరించుచుంటిని. మరల

నరణ్యసంచారిణి నయ్యెదను!''

లుత్ఫున్నీసా యాశ్చర్యాన్విత యయ్యెను. ఇంత త్వరిత ముగ కపాలకుండల యంగీకరించు నని యామె యెన్నఁడు ననుకొనలేదు. అంత నామె యాదరముతో నిట్లనెను: "చెల్లెలా, నీవు దీర్ఘాయుష్మంతురాలవు కమ్ము! నాకుఁ బ్రాణదానము చేసితివి, కాని నేఁడు నిన్ను నాథను జేసి వదలిపెట్టను. తే పుదయమున నీకడకు విశ్వాసయోగ్యయుఁ జతురయు నగు దాసిని బంపెను. ఆమె వెంటఁ బొమ్ము. వర్థమానమున నున్నత పదవియందున్న చెలికత్తెయొకతె కలదు. ఆమె నీకు సమస్త సౌఖ్యములు సమకూర్చును.''

లుత్ఫున్నీసాయు కపాలకుండలయు నన్యమనస్కలై సంభాషించుచుండిరి. కాని ముందు గలుగబోవు విఘ్నమును వారెంత మాత్రము తెలిసికొనలేకుండిరి. వారు కూర్చున్న ప్రదేశమునుండి బయటకుఁ బోవుమార్గమందు నిలుచుండి చాటుగాఁ గాపాలికుఁడును నవకుమారుఁడును వారియెడ నెట్టి క్రూర దృష్టిఁ బరపుచుండిరో యెఱుఁగ లేకుండిరి. కాని దౌర్భాగ్య వశమున వారికాసంభాషణమువినవచ్చుటలేదు. మనుష్యులకు నయనకర్ణములు సమదూరగాము లయ్యెనేని యపుడు వారి దుఃఖప్రవాహము తగ్గిపోవునో వృద్ధియగునో యెవఁడు చెప్పఁ గలరు? సంసారమును సక్రమముగా నడపుట కత్యంతకౌశలము కావలయును.

కపాలకుండల తల విరియఁబోసికొనియుండుట నవకుమా

రుఁడు కనుఁగొనెను. ఎప్పుడు కపాలకుండల తనది కాకపోయెనో యప్పుడే యామె కేశములు విడివడినవి. అంతేకాక యామె కేశరాశి బ్రాహ్మణకుమారుని వీఁపుపైఁ బడి వాని మూఁపులపై వ్రేలాడు శిరోరుహగుచ్ఛములతోఁ గలియుచున్నది. వారిరువురును జాలదగ్గఱగాఁ గూర్చుండి మెల్లమెల్లన మాటలాడుచుండిరి. నవకుమారుఁడు చూచిచూచి మెల్లన నేలపైఁ గూలఁబడెను.

అది చూచి కాపాలికుఁడు తన మొలను వ్రేలాడు నారికేళ పాత్రమును బయటికిఁ దీసి, "వత్సా, నీకు స్మృతి తప్పుచున్నట్లున్నది. ఈ మహౌషధము సేవింపుము. ఇది భవానీప్రసాదము. దీనిని ద్రావిన నీకు మరలఁ జైతన్యము కలుగును." అని పాత్ర మతని నోటి కందిచ్చెను. నవకుమారుఁ డన్యమనస్కుఁడై దానిని ద్రాగి దారుణమైన దాహము నివారించుకొనెను. ఇంత రుచిగానున్న యీ పానీయము కాపాలికుఁడు స్వయముగాఁ దయారు చేసిన తీవ్రమద్యమని నవకుమారుఁ డెఱుఁగఁడు. త్రాగినంత మాత్రమున నవకుమారునకు నూతన శక్తి కలిగెను.

అచట లుత్ఫున్నీసా పూర్వమువలె మృదుస్వరమున కపాలకుండలతో నిట్లనెను. "చెల్లెలా, నీ వొనర్చిన యుపకారమునకుఁ బ్రత్యుపకార మొనర్ప నాకు శక్తిలేదు. అయినను నిన్నుఁ జిరకాలము జ్ఞాపక ముంచుకొనుటయే నాకు సంతోషము. నే నానాఁడు నీ కొసఁగిన యాభరణములను దరి

ద్రమున కిచ్చివేసితి వని విని యుంటిని. ఇప్పుడు నాకడ నేవియు లేవు. నిన్నటిదిన మింకొకపనికోసము నావెంట్రుకలలో నుంగరమును దాచి తెచ్చితిని. జగదీశ్వరి కృపవలన నాపాపకార్యమిపు డవసరము లేకపోయినది. ఈ యుంగరమును నీవు పెట్టుకొనుము. ఇటుపై నీయుంగరమునుజూచినపుడెల్ల యవనియగు నీసోదరిని జ్ఞప్తికిఁ దెచ్చుకొనుము. నీప్రాణేశ్వరుఁ డిదియెక్కడి దని యడిగిన లుత్ఫున్నిసా యిచ్చిన దని చెప్పుము.”

ఇట్లనుచు లుత్ఫున్నిసా యమూల్యమగు నుంగరమును దన వ్రేలినుండి తీసి కపాలకుండలవ్రేలికిఁ బెట్టెను. నవకుమారుఁ డది చూచెను: కాపాలికుఁ డతనిని బట్టుకొని యుండెను. మరల నతఁడు కంపించుట చూచి క్రమ్మఱ నించుక యాతీవ్రమద్యము నాతని నోటి కందిచ్చెను. మదిర నవకుమారుని మెదటిలోఁ బ్రవేశించి యతనిప్రకృతి నంతయు మార్చివేయ నారంభించెను; అంతేగాక యతని హృదయమునుండి ప్రేమాంకురమును గూడ నున్మూలించుచుండెను.

కపాలకుండల లుత్ఫున్నిసాకడ సెలవుఁ గైకొని స్వగృహమునకు బయలుదేఱెను. అపుడు నవకుమారుఁడును గాపాలికుడును లుత్ఫున్నిసాకుఁ గనఁబడకుండ కపాలకుండల ననుసరింపసాగిరి.

## ౮

కపాలకుండల మెలమెల్లన స్వగృహమునకుఁ బోవుచుండెను. అతిగభీరాలోచనమందు మునిఁగి యుండుటచే నామె మందగమనముతో నడచుచుండెను. కారణ మే మన, లుత్ఫున్నీసా చెప్పిన మాటలవలన ఆమె చిత్తవృత్తి యంతయు నొక్క-సారిగా మాఱిపోయినది. ఆమె ప్రాణత్యాగమునకు సిద్ధపడినది. ప్రాణత్యాగ మెవరికొఱకు? లుత్ఫున్నీసా కొఱకా? కాదు.

కపాలకుండల స్వభావముచేతఁ దాంత్రికుల బిడ్డ. తాంత్రికులు కాళికాదేవి యనుగ్రహాకాంక్షులై పరుల ప్రాణములు తీయుటయం దెట్లు నిశ్శంకాత్ములో యట్లె కపాలకుండలయు నాత్మప్రాణపరిత్యాగకాంక్షయందు సంశయవిహీనురాలు. ఆమె కాపాలికునివలె నేకాగ్రచిత్తముతోఁ గాళికాప్రసాదమును గాంక్షించుటలేదు. కాని కాళీమాహాత్మ్యశ్రవణమునందును, దద్దర్శనారాధనములందును నామె యంతఃకరణమున శ్రద్ధకలదు. భైరవీదేవి సృష్టికర్త్రియనియు శాసనకర్త్రియనియు ముక్తిదాత్రియనియు నామెకు మిక్కిలి విశ్వాసము కలదు. పరులదుఃఖము చూచి సహింపలేని యామె కాళికాదేవిపూజాభూమియందు మనుష్యరక్తము ప్రవహించుట చూచియోర్వలేదు. అయినను దేవీ పూజలో లోపము జరుగుట యామె కిష్టముకాదు. ఆవిశ్వశాసనకర్త్రియు సుఖదుఃఖవిధాయినియు

కైవల్య ప్రదాయినియు నగు భైరవీదేవి యిప్పుడు స్వప్నమం
దవతరించిన ప్రాణములు త్యజింపు మని యామె నాదేశించి
నది. కపాలకుండలగాని యిం కెవ్వరుగాని యట్టి యా దేశ
మును బరిపాలింపకుండ నుండఁగలరా?

మనము ప్రాణత్యాగ మొనరింపఁ గోరుకొనము. అనురా
గాతిశయముచే సంసారము సుఖమయ మని చెప్పుదుము.
సుఖాభిలాషముచే సంసారవర్తులమునఁ బడి పరిభ్రమించు
చుందుము? దుఃఖము నభిలషింపము. పురాకృత పాపఫలముచే
నెప్పుడైన మనసుఖాభిలాషము సఫలము కాదేని యపుడు
దుఃఖించుచుఁ గోలాహలము చేయ నారంభింతుము. అప్పుడు
ను దుఃఖము స్వాభావికము కాదనియు స్వభావమునకు విరు
ద్ధమైనదనియుఁ దేలినది. సుఖమే మనమందఱమును గోరఁదగి
నది. ఆసుఖవాంఛయే మనలనందఱను సంసారమునకుఁ గట్టి
వైచినది. కట్లు త్రెంపుకొనఁ గోరము. ఈసంసారబంధమునఁ
బ్రణయము ప్రధానరజ్జువు. కపాలకుండల కట్టి బంధనము
లేదు. ఏబంధనములేదు. ఇఁక నామె నెవరు నిలుపఁగలరు?

నిరోధము లేనివారిగమన మప్రతిహతము. పర్వతశిఖరము
నుండి నిర్ఝరము క్రిందికి దిగునపుడు దానిగతి నెవరునిరోధింపఁ
గలరు? ప్రచండవాత మొక్కసారి వీవ నారంభించినపుడు దాని
సంచారము నెవ రడ్డగింపఁగలరు? కపాలకుండలకుఁ జిత్తచాం
చల్యము కలిగినపు డామెను స్తిమిత పఱచుట యెవరికి సాధ్య
మగును? ఏనుఁగుగున్న మదించినపుడు దాని నెవరు లోపఱచు

కొనఁగలరు?

కపాలకుండల తనశరీరమును జగదీశ్వరీచరణసాన్నిధ్యమం
దేల సమర్పింపఁ గూడ దని వితర్కించుకొనెను. ఈ పాంచ
భౌతికమువలన నేమి ప్రయోజనము?" అని ప్రశ్నించు
కొనెను. "ఏబంధనము లేకున్నను భౌతిక బంధనము మాత్ర
మొకటి కలదు."

కపాలకుండల తల వంచుకొని త్రోవను నడచుచుండెను.
ఎపుడు మనుష్యహృదయము తీవ్రచింతానిమగ్న మగునో,
యెప్పుడేకాగ్రతచే బాహ్యసృష్టియెడలక్ష్యముండదో యపుడు
నైసర్గికములు గాని పదార్థములు ప్రత్యక్షము లగుచుండును.
కపాలకుండల యిప్పు డిట్టి యవస్థయం దున్నది.

ఆకాశమునుండి "వత్సా, నేను త్రోవ చూపించుచు
న్నాను." అను వాక్యము చెవిని బడినట్లు తోఁచి కపాలకుం
డల గగనమువంక దృష్టినిగిడ్చెను. అప్పుడామెకు నభోమం
డలమున నిందితనవనీరదమూర్తి యగు చండీదేవి ప్రత్యక్ష
మయ్యెను. ఆ దేవి కంఠమందు వ్రేలాడు కపాలమాలల
నుండి శోణితము స్రవించుచుండెను. కటిప్రదేశము చుట్టును
మనుష్యహస్తములు వ్రేలాడుచుండెను. వామహస్తమున నర
కపాలము, శరీరమునిండ రుధిరము, లలాటమున దారుణోజ్జ్వ
లజ్వాలావిభాసితమగు లోచనములును దత్సమీపమున బాల
చంద్రుఁడును ప్రకాశించుచుండెను. భైరవీదేవి తన దక్షిణ
హస్తము నెత్తి కపాలకుండలను బిలుచుచున్నట్లుండెను.

కపాలకుండల యూర్థ్వముఖియై నడువసాగెను. ఆ నవకాదంబినీసన్నిభమూర్తి వియత్పథమున నామెకు ముందు నడచుచుండెను. ఆకపాలమాలిని యవయవములు మేఘముల యందెచ్చటనో మఱుఁగువడి యుండెను. అప్పుడప్పుడా దేవి విగ్రహము స్పష్టముగా దృగ్గోచర మగుచుండెను. కపాలకుండల యా దేవివంకఁ జూచుచుఁ జనుచుండెను.

నవకుమారునకుఁ గాని గాపాలికునకుఁగాని యిట్టి దేమియుఁ గానఁబడుట లేదు. నవకుమారుఁడు సురాగరళోద్దీప్తహృదయుఁడగుటచే కపాలకుండల మందగమనమును సహింపలేక "కాపాలికా" యని పిలచెను.

"ఏమి?"

"పానీయం దేహి మే!"

కాపాలికుఁడు మరల నతని కింత మద్యము నిచ్చెను.

"ఇఁక నాలస్య మేమి?" అని నవకుమారుఁ డాతని నడిగెను.

"ఇఁక నాలస్య మే మున్నది?"

నవకుమారుఁడు భీషణస్వరముతో "కపాలకుండలా" అని పిలిచెను. కపాలకుండల యులికిపడెను. సామాన్యులెవ్వరును నామెను బేరుపెట్టి పిలువరు. ఆమె వారివంకఁ దిరిగి నిలుచుండెను. వా రామె యెదుటికి వచ్చిరి. కపాలకుండల మొదట వారిని గుర్తింపక, 'మీ రెవరు? యమదూతలా?' అనెను.

పరక్షణమున నామె వారిని గుర్తించి, "కాదు, కాదు. తండ్రీ!

మీరు నన్ను బలి యీయ వచ్చినారా?'' అని పలికెను.

నవకుమారుఁ డామెహస్తమును గట్టిగాఁ బట్టుకొనెను. కాపాలికుఁడు కరుణార్ద్రమగు మధురస్వరముతో, ''వత్సా! మా వెంట రమ్ము!'' అని వచించి శ్మశానాభిముఖుఁడై పోవ సాగెను.

కపాలకుండల యంబరమువంక దృష్టి సారించెను. గగన సంచారిణి యగు భయంకరమూర్తివంకఁ జూడ రణవిహారిణి యగు నాదేవి పకపక నవ్వుచుండెను. దీర్ఘమగు త్రిశూల మొకచేతితోఁ బట్టుకొని యాదేవి కాపాలికుఁడు పోవుమార్గ మువంకఁ జూపించుచుండెను. కపాలకుండల యేమియుఁ బలు కక పిచ్చిదానివలెఁ గాపాలికునివెంట నడచుచుండెను. నవ కుమారుఁడు పూర్వమువలె నామె హస్తమును గట్టిగాఁబట్టు కొని చనుచుండెను.

౬

చంద్రుఁ డస్తమించెను. విశ్వమంతయుఁ నంధకార మయ మయ్యెను. కాపాలికుఁడు పూజాప్రదేశమునకు కపాలకుండలను గొనిపోయెను. అచట గంగాతీరమున నెత్తైన సైకతభూమి యొకటి కలదు. దానియెదుట మఱింతగొప్పదగు మఱి యొక యిసుక తిన్నె కలదు. ఆతిన్నెమీఁద శ్మశాన మున్నది.

సముద్రపుఁబోటు సమయమున నా యిసుక తిన్నెల రెంటి
కిని నడుమఁ గొంచెము జలము నిలుచును. పాటుసమయమున
నీ రుండదు. ఇపుడు జలము నిలిచి యుండలేదు. గంగ కెదు
రుగా నున్న యీ శ్మశానభూమి చాలా మెత్తైనది. నీటిలో
దిగఁబోయినచో నొక్కసారి యీమెత్తునేలనుండి యగాధ
జలములోఁ బడుదురు నిరంతరవాయుసంతాడితతరంగాఘాత
ములచే నా యున్నతవాలుకాభూమి కోసికొని పోవుచుండును.
అప్పుడప్పు డా యగాధజలమం దిసుకపెళ్ళలు విఱిగి పడు
చుండును.

పూజా ప్రదేశమున దీపము లేదు. కాష్ఠమొకటి మాత్ర
ము మండుచుండెను. ఆవెలుతురులో శ్మశానభూమి భయంక
రముగా దృగ్గోచర మగుచుండెను. కాష్ఠముచెంతఁ బూజ,
హోమము, బలి, మొదలగు వానికిఁ బనికివచ్చు సామగ్రి
లన్నియు నాయత్తములై యుండెను విశాలమగు నదీ హృద
యము చీఁకటిలో మఱింత పెద్దదిగాఁ గానవచ్చుచుండెను.
గంగాహృదయమునఁ జైత్రవాయు వప్రతిహతవేగముతో
వీచుచుండెను. కావున నలల తాకుడుచేఁ గలిగిన కలకల
నినాదము దిగంతముల వ్యాపించుచుండెను. శ్మశానభూమి
యందు శవభుక్కులగు జంతువులు కర్కశస్వరముతో నప్పు
డప్పుడు ధ్వని చేయుచుండెను.

కాపాలికుఁడు నవకుమారుఁడు కపాలకుండల యను
కూలస్థలములందుఁ గుశాసనములపైఁ గూరుచుండి తాంత్రిక

విధుల ననుసరించి పూజ చేయ నారంభించిరి. బలి సమయమునకు కపాలకుండలను స్నానముచేయించి తీసికొని రమ్మని కాపాలికుఁడు నవకుమారునితోఁ జెప్పెను. నవకుమారుఁడు కపాలకుండల చేయి పట్టుకొని స్నానము చేయింప శ్మశానము మీఁదుగా నామెను దీసికొని పోవుచుండెను. అతని యడుగులక్రింద నెముకలు పుటపుట విఱిగిపోవుచుండెను. అతని కాలి త్రొక్కుడుచే వల్లకాటియందున్న నీటిముంత పగిలిపోయెను. దానిచెంతఁ బీనుఁగు పడియుండెను. ఆ నిర్భాగ్యురాలి కెవ్వరు సంస్కారము గూడఁ జేసియుండలేదు. ఆ శవము వారిరువుర కాళ్ళకుఁ దాకెను. కపాలకుండల దానిని దాఁటిపోయెను. నవకుమారుఁడు దానిని ద్రొక్కుచు బోయెను. నలుదెసలఁ దిరుగుచు శవమాంసభుక్కులగు మృగములు తిరిగి వచ్చుచుండెను. మనుష్యు లిరువు రేతెంచు చుండుటచే నవి బిగ్గఱగా నఱవసాగెను. వానిలోఁ గొన్ని వారిపైఁ బడవచ్చెను. కొన్ని తటతట నావలకుఁ బోయెను. నవకుమారుని హస్తము కంపించుచుండుట కపాలకుండల కనుఁగొనెను. ఆమె నిర్భయముగ నిష్కంపముగ నుండెను.

"భయము కలుగుచున్నదా?" అని యామె యతని నడిగెను.

నవకుమారునకు మత్తు క్రమముగా తగ్గిపోవుచుండెను. అతఁ డతిగంభీరస్వరముతో "భయమా, మృణ్మయీ? భయము మాత్రము లేదు."

“ఇట్లయిన వణఁకుచున్నా రేల?”

ఈమాటలు కపాలకుండల కేవలము రమణీసహజ మగు కంఠస్వరముతోఁ బలికినది. ఎపుడు రమణీహృదయము పరుల దుఃఖమునకు ద్రవించునో యపుడే యట్టి స్వరము వెలువడుట సంభవించును. మరణకాల మాసన్న మగుచుండ వల్లకాటి యందు కపాలకుండల కంఠమునుండి యట్టి స్వరము వెలువడు నని యెవ్వ రెఱుఁగుదురు!

అతఁడు: “భయము లేదు. ఏడ్పుగూడ వచ్చుటలేదు. కేవలము క్రోధముచేఁ గంపించుచున్నాను!” అనెను.

“ఏడ్చు టెందుకు ?”

మరల నా కంఠస్వరమే !

“ఏడ్చు టెందుకా? నీ కేమి తెలియును, మృణ్మయీ! నీ విట్లెన్నడును రూపము చూచి యున్మత్తురాలవుగా లేదు!” ఇట్లు పలుకుచుండ నవకుమారుని కంఠస్వరము యాతనచే స్తంభింపఁజొచ్చెను. “నీ వి ట్లెన్నడును నీ హృత్పిండమును నీవే ఛేదించుకొని వల్లకాఁటియందుఁ బాఱఁజల్లుటకు వచ్చి యుండలేదు” అని పలికి నవకుమారుఁడు తత్క్షణమే కేకవైచి యేడ్చుచు నామె కాళ్ళపై నడ్డముగాఁ బడెను.

“మృణ్మయీ, కపాలకుండలా! నన్ను రక్షింపుము నీ కాళ్లపైఁబడియున్నాను. నీవు విశ్వాసఘాతుకురాలవు కావని యొక్కసారి చెప్పుము. ఒక్కసారి చెప్పుము! నేను నిన్ను హృదయమున హత్తుకొని యింటికిఁ గొనిపోయెదను.”

కపాలకుండల యాతని చేయి పట్టుకొని లేవఁదీసి మృదు స్వరముతో, "మీరు నన్నావిషయ మడుగ నక్కఱ లేదు." అని పలికెను.

వా రిరువురు నీటి యొడ్డునకుఁ జేరిరి. కపాలకుండల తీరము వైపునకుఁ వీఁపు వెట్టి నిలుచుండెను. ఆమె వెనుక నింకొక యడుగులో జలము కలదు. అపుడు సముద్రపుఁబోటు ప్రారంభ మయ్యెను. కపాలకుండల తీరమున నున్న యెత్తుదిబ్బపై నిలిచి "మీరు నన్నావిషయ మడుగ నక్కఱ లేదు." అని పలికెను.

నవకుమారుఁ డున్మత్తునివలె, "నేను దెలివిఁ గోలుపోతిని! నే నే మడుగవలయునో చెప్పుము, మృణ్మయీ, చెప్పుము. చెప్పుము, చెప్పుము, నన్ను రక్షింపుము. ఇంటికి నడువుము" అని పలికెను.

"అడిగితిరి, గాన చెప్పెదను. నేఁటిరాత్రి మీ రెవరిని జూచితిరో యామె పద్మావతి. నేను విశ్వాసఘాతుకురాలను గాను. ఆ వృత్తాంత మంతయుఁ జెప్పెదను. కాని యిఁక నే నింటికి రాను? భవానీచరణసాన్నిధ్యమందు నా దేహము సమర్పింప వచ్చితిని. నిశ్చయముగా నట్లొనర్చెదను. మీ రింటికిఁ బొండు, నేను మరణించెదను."

"వలదు. మృణ్మయీ. వలదు." అని పలుకుచూ నవకుమారుఁడు కపాలకుండలను దన హృదయమునకు హత్తుకొన చేతులు చాచెను. కాని యతనికి కపాలకుండల లభింప లేదు.

చైత్రవాయుసంతాడిత మగు గొప్పతరంగ మొకటి లేచి కపాలకుండల నిలుచుండిన తటమునకుఁ గ్రిందుగాఁ గొట్టుకొనెను. వెంటనే యొడ్డువిరిగి ఘోరారవమున కపాలకుండలతోఁగూడ నదీప్రవాహమునఁ బడిపోయెను.

ఒడ్డు విరుగునపుడు జనించిన భయంకరారవము నవకుమారుఁడు విన్నాఁడు. కపాలకుండల యంతర్హితయగుట చూచినాడు. తానుగూడ నామెవెంట గభాలునఁ బ్రవాహములో దుమికినాఁడు. అతనికి బొత్తుగా నీఁత చేతఁగాకపోలేదు. అతఁడు కొంచెముసే పీఁదుచు నామెకొఱకు వెదకినాఁడు. అతని కామె లభింపలేదు.

ఆ యనంతగంగాప్రవాహమున వసంతవాయుసంతాడిత తరంగమాలికలయం దూగుచు నూగుచు కపాలకుండలా నవకుమారు లెచటికిఁ బోయిరి ?

సమాప్తము.



భారతీ ప్రెస్: తెనాలి,